ణేనమః - తార్క్ష్యవాహనాయనమః - సనాతనాయనమః - నారాయ
ణాయనమః - పద్మనాభాయనమః - హృషీకేశాయనమః - సుధాప్ర
దాయనమః - మాధవాయనమః - [illegible]యనమః - [illegible]
నమః - పరాత్పరాయనమః - వనమాలినేనమః - యజ్ఞరూపాయ
నమః- చక్రపాణయేనమః - గదాధరాయనమః - ఉపేంద్రాయనమః
కేశవాయనమః- హంసాయ- సముద్రమథనాయ- హరయే- గోవిం
దాయ- బ్రహ్మజనకాయ- కైటభాసురమర్దనాయ- శ్రీధరాయ -
కామజనకాయ - శేషాయనమః - చతుర్భుజాయ - పాంచజన్యధరా
యనమః - శ్రీమతేనమః - శార్ఙ్గపాణయేనమః - జనార్దనాయ -
పీతాంబరధరాయ - దేవాయ - సూర్యచంద్రవిలోచనాయ - మత్స్య
రూపాయ - కూర్మతనవే - క్రోడరూపాయ - నృకేసరిణే - వామనా
య-భార్గవాయ - రామాయ - హరయే - కల్కినే - హయాన
నాయ-విశ్వంభరాయ-శిశుమారాయనమః-శ్రీకరాయ-కపిలాయనమః
ధ్రువాయ - దత్తాత్రేయాయ- అచ్యుతాయ- అనంతాయ- ప్రద్యు
మ్నాయ- పురుషోత్తమాయ- శ్రీవత్సకౌస్తుభధరాయ - మురారయే
అధోక్షజాయ- ఋషభాయ- మోహినీరూపధారిణేనమః - సంకర్ష
ణాయ పృథవే - క్షీరాబ్ధిశాయినే - భూతాత్మనే - అనిరుద్ధాయ -
భక్తవత్సలాయ - నరాయ - గజేంద్రవరదాయ - త్రిధామ్నేనమః -
భూతభావనాయ- శ్వేతద్వీపసువాస్తవ్యాయ - సూర్యమండలమధ్య
గాయనమః సనకాదిమునిధ్యేయాయ - భగవతేవ - శంకరప్రియాయ-
నీళాకాంతాయ- ధరాకాంతాయ- పద్మనాభాయ- బాదరాయణాయ
నమః భాగీరథీజన్మభూమి పాదపద్మాయనమః సతాం ప్రభవే -
స్వభువేనమః - విభవేనమః - ఘనశ్యామాయ - జగత్కారణాయ -
అవ్యయాయ - బుద్ధావతారాయ శాంతాత్మనే - లీలామానుషవిగ్ర
హాయదామోదరాయ-విరాడ్రూపాయ-భూతభవ్యభవత్ప్రభవే- ఆది
దేవాయ - దేవదేవాయ - ప్రహ్లాద పరిపాలకాయ - ఇతిపూజాం
సమర్పయామి।

శ్లో॥ చందనాగరుకర్పూర ఘృతగుగ్గులసంయుతం । గృహాణ
ధూపంతులసీ వందేహం భక్తవత్సలే॥ ధూపమాఘ్రాపయామి॥ ఘృత

వర్తిషుదీప్తం తే మయార్పితమిదం శుభే। గృహాణమంగళం దీపం సర్వైశ్వర్యప్రదాయిని ॥ దీపం దర్శయామి ॥ శ్లో ॥ క్షీరంచగుడసంయుక్తం సర్పిషాయుతమాదరాత్ । మయానివేదితం భుక్ష్వ పంచభక్ష్యసమన్వితమ్ ॥ నైవేద్యం సమర్పయామి ॥ పూగీఫలైశ్చకర్పూరైర్నాగవల్లీదళైర్యుతం । తాంబూలంగృహ్యతాం దేవి వరదే భవశోభనే । తాంబూలం సమర్పయామి ॥ పద్మనాభప్రియే దేవి పద్మసంభవపూజితే । పద్మపత్రవిశాలాక్షి వరదాభవసర్వదా ॥ నీరాజనం సమర్పయామి ॥ వ్రతపూర్తిం మహాకీర్తిం దివ్యస్ఫూర్తిం హరిప్రియే । ప్రాప్తుకామ ఇదం దేవి సౌవర్ణం పుష్పమర్పయే । మంత్రపుష్పం సమర్పయామి ॥ యానికానిచేతి ప్రదక్షిణం ॥ నమస్కరోమి త్వాం దేవి విష్ణువక్షస్థలేస్థితాం । ప్రణతార్తిహరే నిత్య మభీష్టఫలదా భవ । నమస్కారః॥ యస్యస్మృత్యాచేతి పూజావిధానం సంపూర్ణమ్ ॥

## వ్రతకథా ప్రారంభః.



శ్లో॥ శౌనకాద్యామునిగణా నైమిశారణ్యవాసినః । దీర్ఘసత్రప్రకుర్వాణా నియమేనసమన్వితాః ॥ ౧ ॥ తత్రాగతం మహాప్రాజ్ఞం సూతం పౌరాణికోత్తమమ్ । సర్వశాస్త్రార్థతత్వజ్ఞం వేదవేదాంతపారగమ్ ॥ ఊచుః ప్రాంజలయస్సర్వే మునయస్సంశ్రితవ్రతాః ॥ ౨॥

తా॥ నైమిశమను పేరుగల వనమందు నివసించియున్నట్టి వంటియును, మిక్కిలి నియమముతోఁ గూడియున్నటు వంటియును, బహుకాలమునకుఁ బూర్తికాఁదగిన యజ్ఞమును జేయుచున్నటువంటియు, శౌనకుఁడు మొదలయిన మునీశ్వరులు మహాబుద్ధిమంతుఁడును పురాణము తెలిసినవారిలో నుత్తముండును సకలశాస్త్రములయొక్కయు వేదములయొక్కయు రహస్యములను దెలిసినవాఁడును వ్యాసశిష్యుఁడు నయిన సూతులవారచ్చటికి రాఁగా దోసిలియొగ్గినవారై యొక వాక్యమును బలికిరి.

ఋషయః॥ శ్లో॥ సూతసూత మహాప్రాజ్ఞ సర్వధర్మార్థకోవిద । యేన వ్రతేనతుష్టోఽసౌ దేవదేవో జనార్దనః ॥ 3 ॥ నారీణాం పుణ్య

స్త్రీణాం సౌభాగ్యసంపద్భవేత్ । తద్వ్రతం వద సర్వజ్ఞ లోకానా ముపకారకమ్ ॥ ౫ ॥

తా॥ ఓ సూతుఁడా ! నీవు మహాబుద్ధిమంతుఁడవు; సర్వధర్మము లను దెలిసినవాఁడవు; దేవదేవుఁడయినవిష్ణుమూర్తి యేవ్రతముచేసిన సంతోషించి పుణ్యస్వభావులయిన స్త్రీలకు శాశ్వతమయిన సౌభాగ్య మును బుత్రపౌత్రాదిసంపత్తులను గలుగఁజేయునో, లోకోపకారక మైన ఆ వ్రతమును జెప్పుమని యడిగిరి.

సూతఉవాచ॥ శ్లో॥ శ్రుణుధ్వమృషయస్సర్వే వ్రతానాముత్తమం వ్రతమ్ ॥

తా॥ సూతుఁడు చెప్పుచున్నాడు. ఓ ఋషీశ్వరులారా! వ్రత ములలో శ్రేష్ఠమయిన వ్రతమును చెప్పుచున్నాను వినుఁడు.

శ్లో॥ ద్వాపరేతు యుగేపూర్వం వైకుంఠో విష్ణురవ్యయః ।
భూభారహరణార్థాయ జగత్యాం వసతిప్రభుః ॥౬॥

తా॥ పూర్వము ద్వాపరయుగ మందు వైకుంఠవాసుఁడును నాశరహితుఁడునయిన విష్ణుమూర్తి భూభారము హరించుకొఱకు ద్వారకాపురమందు నివసించియుండెను.

శ్లో॥ తంద్రష్టుంకామో భగవా న్నారదో మునిరాగతః ।
దృష్ట్వాతం సహసోత్థాయ స్వాసనాద్హరిరీశ్వరః ॥౭॥
పూజయిత్వా యథాన్యాయం షోడశైరుపచారకైః ।
పప్రచ్ఛ మునిశార్దూలం వ్రతంలోకోపకారకమ్ ॥౮॥

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడైనట్టి నారదమహాముని కృష్ణ మూర్తిని జూచుటకుఁ గోరికగలవాఁడై ద్వారకాపురమునకు రాఁగా నప్పుడు ఈశ్వరుఁడయిన కృష్ణమూర్తి యీ నారదమహామునిని జూచి గద్దియనుండి లేచి షోడశోపచారములచేఁ బూజించి కూర్చుండబెట్టి లోకోపకారక మయిన వ్రతము నడుగఁదలచి యొక వాక్యమును బలికెను.

కృష్ణః-శ్లో॥ నారదాఽశేషధర్మజ్ఞ లోకానాంహితకారణమ్।
కథయస్వమహాభాగ వ్రతమ్ దేవర్షిసత్తమః॥౯॥

తా॥ ఓనారదమహామునీ! సమస్త ధర్మములను దెలిసినవాఁడా

దేవఋషులలో శ్రేష్ఠుడా! లోకముల కుపకారమైనవ్రతమును జెప్పు మని కృష్ణమూర్తియడిగెను.

నారద ఉవాచ:- శ్లో॥ వ్రతానాముత్తమంపుణ్యం సర్వసౌభాగ్య కారణం॥ సర్వ సంపత్కర శీఘ్రం పుత్రపౌత్రప్రవర్ధనమ్ ॥౧౦॥ ఇషే మాసేసితేపక్షే హ్యేకాదస్యాముపోషితః। తులసీంచమహావిష్ణుం పూజ యిత్వాసమాహితః। పంచపద్మాన్యలం కృత్య పంచదీపాణ్ ప్రకల్పయేత్

తా॥ నారదుఁడు చెప్పుచున్నాఁడు:-వ్రతములలో నుత్తమమైన దియు, సర్వశుభములకుఁ గారణమైనదియు, సకలసంపదల నిచ్చు నదియు బుత్రులను బౌత్రులను వృద్ధిపొందించునదియు, నైనయొక వ్రతముకలదు. ఆ వ్రతమేరీతిఁజేయవలయుననఁగా - ఆశ్వయుజశుద్ధ ఏకాదశీదినమున నుపవాసముచేసి స్థిరచిత్తుఁడై తులసీసన్నిధానమున నైదుపద్మములను లిఖించి యైదుదీపములను వెలిగించి తులసీసహితుఁ డైన లక్ష్మీనారాయణుని బూజింపవలయును.

శ్లో॥ గంధాద్యక్షతనైవేద్య తాంబూలానిసమర్పయేత్।
పదక్షిణనమస్కారాణ్ పంచపంచప్రకల్పయేత్ ॥౧౨॥

తా॥ గంధము అక్షతలు నైవేద్యము తాంబూలము నీరాజ నము మంత్రపుష్పములను యథాక్రమముగ సమర్పించి అయిదైదు చొప్పున ప్రదక్షిణ నమస్కారములను జేయవలెను.

శ్లో॥ తదాదిమాసపర్యంతం ప్రత్యహంచసమాచరన్ । ఊర్జే మాసిసితేపక్షే హ్యేకాదశ్యాముపోషితః॥ పూర్వవత్తులసీ పూజాం కృత్వానియమపూర్వకమ్। రాత్రౌజాగరణంకృత్వా చాధశ్శాయీజితేంద్రియః॥ తతఃప్రభాతవేళాయాంస్నాత్వాశుచిరలంకృతః। కుడుపే నచపిష్టేచ కారయేత్పిష్టకవ్రతమ్॥

తా॥ ఆశ్వయుజ శుద్ధైకాదశిమొదలుకొని కార్తికశుద్ధైకాదశి పర్యంతము నెలదినములును ప్రతిదినము తులసీసహితుఁడైన లక్ష్మీ నారాయణమూర్తిని యథావిధిగా బూజించి కార్తిక శుద్ధ ఏకాదశి దినమున పూర్వమునలెనే నియమముగా పూజించి యుపవాసముండి రాత్రియందు జాగరణచేసి భూమియందు శయనించి బ్రహ్మచర్య

వ్రతముగలవాఁడై తెల్లవారిన పిమ్మట స్నానముచేసి పరిశుద్ధుఁడై యలంకరించుకొని మానెడుబియ్యపు పిండితో బెల్లమును గలిపి మూఁడు ముద్దలను జేయవలెను.

శ్లో॥ ఏకంతులస్యైదత్వాతు బ్రాహ్మణాయైకమేవచ । తృతీయం క్షితేస్వత్ర [illegible] ॥ యావంతఃక్షీరపృషతా స్వశరీరేపతంతిహి। తావంత్యబ్దసహస్రాణి స్వర్గలోకే మహీయతే॥

తా॥ ఆమూఁడుముద్దలలో నొకముద్దను తులసిసహిత లక్ష్మీనారాయణమూర్తికి నివేదనముచేసి రెండవ దానిని బ్రాహ్మణునికిచ్చి మూఁడవ ముద్దను రోటిలోనుంచి చెఱకుగడమూలముతో ద్రొక్కవలెను. అలాగునఁ ద్రొక్కుసమయమునఁ జెఱకుపాల బిందువు లెన్ని తనశరీరమందుఁ బడునో, యన్ని వేల సంవత్సరములు స్వర్గలోకమందు సుఖముగానుండఁ గలడు.

శ్రీకృష్ణః-శ్లో॥ పూర్వమాచరితం కైస్తు వ్రతమేవత్ఫలైషిభిః॥ తద్వ్రతా చరణాత్కిం వైఫలం ప్రాప్తం మహామునే॥

తా॥ శ్రీకృష్ణమూర్తి యడుగుచున్నాఁడు. ఓనారదమునీశ్వరా యిప్పుడు మీచేఁజెప్పఁబడిన వ్రతఫలమును గోరివారలై యెవ్వరాచరించిరో యావ్రతమును చేయుటచే నేఫలమును బొందిరో చెప్పుము.

నారదః॥ శ్లో॥ పురాకశ్చిన్మహాతేజో బ్రాహ్మణోఽభవన్మహాప్రభో । వేదశాస్త్రార్థతత్వజ్ఞోదేవదత్తఇతి స్మృతః॥

తా॥ నారదమునీశ్వరుఁడు చెప్పుచున్నాడు. ఓ మహాప్రభువైన కృష్ణా! పూర్వమందు మహాప్రభావముకలిగి వేదశాస్త్రరహస్యమును దెలిసినట్టి దేవదత్తుఁడను ప్రసిద్ధిగల బ్రాహ్మణుఁడొకడుకలఁడు.

శ్లో॥ సకదాచిద్విజశ్రేష్ఠో విచింత్యాఽశ్మత్యపుత్రకః । ఆరాధయామిదేవేశం విష్ణుంత్రైలోక్యపావనమ్ ॥ ఇతిసంచిన్త్యమనసా తపశ్చక్రేసుదుర్లభమ్॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడు తాను సంతానము లేనివాడనని యొకప్పుడు విచారించి మూఁడు లోకములను బవిత్రముచేయు దేవదేవు

డైన విష్ణుమూర్తిని సేవించిన సంతానము కలుగునని యాలోచించి కఠినమైన తపస్సు చేసెను.

శ్లో॥ వృద్ధబ్రాహ్మరూపేణ ప్రాదుర్భూతాత్వాతదంతికే।
తపశ్చరంతంతంద్రుష్ట్వా విష్ణుం ప్రాహమహావిభుః॥

తా॥ మహాప్రభునైన విష్ణుమూర్తి ముసలి బ్రాహ్మణరూపమును ధరించి యా బ్రాహ్మణుని సమీపమున బ్రత్యక్షమై ఘోరతపస్సును జేయుచున్న బ్రాహ్మణునిజూచి యొక వాక్యమును పలికెను.

వృద్ధః-శ్లో॥ కిమర్థకృతమాశ్చర్యం తపోవదమహాద్విజ॥

తా॥ ఓ విప్రోత్తమా! ఘోరమైనతపస్సు నెందునిమిత్తమై చేయుచుంటివని ముసలిబ్రాహ్మణుండడిగెను.

శ్లో॥ శృత్వాతద్వాక్యమచిరా త్ప్రణమ్యశివసాహరిమ్। దేవదేవజగన్నాథ త్రాహిమాంపురుషోత్తమ। అద్యమేసఫలంజన్మ త్వత్పాదాంభోజదర్శనాత్। మదీప్సితంచసఫలం భవిష్యతినసంశయః॥ అపుత్రకోమహాదుఃఖఃశరణంత్వాంభజామ్యహం। పుత్రందేహిమహాదేవ సర్వలోకవరప్రద।

తా॥ ఆ విప్రుండాముసలిబ్రాహ్మణుని వాక్యమునువిని దిగ్గున లేచి శిరస్సువంచి నమస్కరించి ఓ దేవ దేవ! లోకనాయక! పురుషోత్తమ! నన్ను రక్షింపుము. నీపాదపద్మములను జూచుటచే నాజన్మము సార్థకమైనది. నాకోరికయుసిద్ధింపఁగలదు; సందేహములేదు. ఓమహాదేవ! సర్వలోకములకువరములనిచ్చువాఁడా! నేను పుత్రులు లేనివాఁడనై మహాదుఃఖముచే నిన్ను సేవించుచుంటిని. నాకుఁ గుమారునిచ్చి యనుగ్రహింపుమని వేఁడుకొనెను.

నారాయణఉవాచ:-శ్లో॥ ఆయుర్హీనం సుతంవాఽపి సుతాంవాపుత్ర భర్తృకామ్। తయోరేకంవృణీష్వాథ దదామితవసువ్రత॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! ఆయుస్సులేని కుమారుఁడు కావలెనా? పెనిమిటి బ్రతుకని కుమార్తె కావలెనా? ఈ రెంటిలో నీకిష్టమైదాని నొకటిచ్చెదనని భగవంతుఁడు పలికెను.

దేవదత్తఉవాచ:-శ్లో॥ స్వగృహంప్రాప్యభార్యాయా ఏతద్వార్తాం నివేద్యచ। ఉభయోరేకమిచ్ఛామి హ్యాగమిష్యామి కేశవ॥

తా॥ ఓ స్వామి ! నేనింటికివెళ్ళి నాభార్యకు నీవృత్తాంతము నెరిగించివచ్చి రెంటిలోన కదానిని గోరెదనని దేవదత్తుఁడుచెప్పెను.

శ్లో॥ ఇతి [illegible]మ్యశిరసా జగామస్వగృహంప్రతి।
నివేద్యసర్వంభార్యాయై బహుధాఽలోచ్యచింతితౌ ॥

తా॥ ఈ ప్రకారముపలికి సాష్టాంగముగా నమస్కరించి యా విప్రుండు తనయింటికివెళ్ళి యావృత్తాంతము భార్యతోఁజెప్పి భార్యయుం దాను ననేకవిధంబుల నాలోచించి చింతించుచుండిరి.

భార్యోవాచ:- శ్లో॥ సుతాహియాచ్యతాంస్వామిన్ భర్తృహీనాపిచ త్వయా। తథేత్యుక్త్వాసవిప్రేంద్రః పునస్తీరంప్రవిశ్యచ ॥ నారాయణ నమస్తేఽస్తుపుత్రికాందాతుమర్హసి॥

తా॥ ఈరీతిగా విచారించు సమయమున ఓస్వామీ వైధవ్యమును బొందినప్పటికిని దీర్ఘాయుర్దాయముగల కుమార్తెను గోరుమని భార్యపల్కగా నాబ్రాహ్మణుఁడాలాగుననే కోరెదనని తిరిగి తీరము వద్దకువెళ్ళి ఓనారాయణమూర్తీ! నీకునమస్కారముచేయుచున్నాను. నాకు కుమార్తెను దయచేయుమని ప్రార్థించెను.

శ్లో॥ తథేత్యుక్త్వా మహావిష్ణు రంతర్థానంయయౌతదా।
అదృష్ట్వాతం మహావిప్ర శ్చాగతస్వగృహంప్రతి॥

తా॥ ఆలాగుననే నీకుఁగూతురు కలుగునని విష్ణుమూర్తి యంతర్ధానమాయెను. ఆబ్రాహ్మణుండు విష్ణువంతర్ధానమైన వెంటనే యింటికివెళ్ళెను.

శ్లో॥ కిచిత్కాలేవ్యతీతేతు పుత్రీజాతాచవైశుభా।
సర్వలక్షణ సంపన్నా సర్వరోగవివర్జితా।
పితుర్గృహేతుసాకన్యా వర్థితాచసురూపిణీ॥

తా॥ కొంచెము కాలము గడచిన పిమ్మట ఆదంపతులకు నొక కుమార్తె జనించెను. ఆమె సర్వలక్షణములుగలదై మిక్కిలియారోగ్యముగలదై మిక్కిలి సౌందర్యము గలదియునై తండ్రి గృహంబునఁ బెరుగుచుండెను.

శ్లో॥ తతఃకాలేతుసంప్రాప్తే వివాహమకరోత్పతితా।
జన్మాంతరకృతాత్పాపా జ్జాతాసామృతభర్తృకా॥

తా॥ అనంతరం వివాహకాలము రాఁగానే తండ్రి వివాహము చేసెను. పూర్వజన్మంబునఁ జేసిన దుష్కృతముచే ఆమె వెంటనే వైధవ్యమును బొందిన దాయెను.

శ్లో॥ జననీ జనకౌతస్యాస్తు తస్వర్గమవాపతుః। తద్గృహేవిధవాసాపిసర్వధర్మవివర్జితా। నాస్తినారాయణేత్యుక్త్వం వదంతి మృతభర్తృకా॥ అతిథిం నార్చయత్యేవ కదాపిగృహమాగతమ్॥

తా॥ ఆచిన్నదానియొక్క తల్లిదండ్రులాదుఃఖముచేతనే స్వర్గస్థులైరి. వారుపోయినపిమ్మట నావిధవమైన చిన్నది సర్వధర్మములను విడచి "హాస్తినారాయణ" యని పలుకుచు నొకానొకప్పుడు యింటికివచ్చిన యతిధిని బూజింపనిదాయెను.

శ్లో॥ ఏవంకఠినచిత్తాసా స్థితానిష్ఠురభాషిణీ। కశ్యగుచ్ఛాన్నదే సాధ్వ్యామన్నామాఽథనయాతయా। ఇతితుష్టోహృషీకేశో ద్విజో భూత్వా సమాగతః॥ తామయాచతవిష్ణుశ్చ తద్వచస్నాబ్రినితుస్తనః॥

తా॥ ఈప్రకారముగా కఠినచిత్తురాలై నిష్ఠురముగా మాటలాడుచున్నదై యామెయుండెను. అప్పుడు విష్ణుమూర్తి యీచిన్నది పెనిమిటిలేనిదయి యెల్లప్పుడు సకలపాపహరమైన నాయొక్కనామమును స్మరించుచున్నదని సంతోషించి బ్రాహ్మణరూపమును ధరించి యామెయింటికివచ్చి బిక్షనడుగఁగాబూర్వమువలెనే నాస్తినారాయణ యని పలికినదాయెను.

శ్లో॥ కాలోప పన్నానతిథీ కిమర్థమవమన్యసే। ఇతిబ్రువాణం తం విష్ణుంరుషాలేపాం శుకంతదా॥ తన్మధ్యేచాఽఘకంబీజం దృష్ట్వా హరిరధాపయత్। మృతాకాలేనసాకీటో భూత్వా తత్స్వత్నుక స్థితా॥

తా॥ అప్పుడావిష్ణుమూర్తి యాచిన్నదానినిజూచి ఘృత్యకాలమందు సంప్రాప్తమయిన అతిధుల నేలయవమానించెదవనిపలుకఁగా రోషముతో నలుగుగుడ్డ నా బ్రాహ్మణునిమీద బారవేసెను. అప్పుడాయన సంతోషించి యాయలుగు గుడ్డను విడదీసిచూడఁగా మర్యనొక కందిగింజ దొరకెను. అంతట నాగింజ నొకచోట మొలవేసి తనలోకమునకు నారాయణమూర్తి వెళ్లెను. ఆచిన్నది కొంతకాలము

నకు స్మృతినొంది యొకపురుగై యాకందిచెట్టుయొక్క యాకులను దినుచుండెను.

శ్లో॥ తతఃకదాచిత్తాంస్మృత్వా దేవీంహరిరువాచహ। ద్రష్టుం యాస్యామి హే దేవి ఏహి నారాయణాభిధామ్॥ ఇత్యుక్త్వాఽథగతేవిష్ణౌ సహతే నరమాయయా। ఆగచ్ఛకింనుభద్రింతే హరిరిత్యవదీప్సితామ్

తా॥ అనంతరం నొకానొకప్పు డాచిన్నది జ్ఞాపకమునకురాగా విష్ణుమూర్తి లక్ష్మీదేవితోనిట్లనిపలికెను. ఓ లక్ష్మీ కందివనమందు నా రాయణమ్మఅనునామముగలచిన్నది నివసించియున్నది. దానిని జూ చుటకు నేనుబోవుచున్నానని వెడలఁగా లక్ష్మీదేవికూడ విష్ణుమూర్తి తో బయలుదేరెను. అంతటవిష్ణుమూర్తి యాకీటకమునుచూచి యిటు రమ్మా నీకుక్షేమమేనాయని యడిగెను.

కీటక ఉవాచ:–శ్లో॥ ఏవంతిష్ఠామి హే దేవప్రసీద జగదీశ్వర।
ఇతి ప్రణమ్యశిరసా కీటస్తూష్ణీంస్థితస్తదా॥

తా॥ పురుగురూపమును ధరించిన యా మగువ ఓ దేవదేవ ఓలోకనాయకా! ఈ ప్రకారముగా నివసించుచుంటిని. నాయందను గ్రహముంచుమని పలికి సాష్టాంగముగా నమస్కరించియూరకుండెను.

దేవ్యువాచ:– శ్లో॥ కిమర్థమేషాకీటోఽభూద్దేవదేవవదస్వమే। ఇతి పృష్టశ్శ్రియావిష్ణుస్తద్వృత్తాంతమవోచరిత॥ తచ్ఛ్రుత్వాకమలాదేవీ తన్మోక్షంచాఽప్యపృచ్ఛత॥

తా॥ దేవతలకు దేవుఁడవైన యోనాథా! యాచిన్నది యెందు నిమిత్తము పురుగై పుట్టినదో చెప్పుమని లక్ష్మీదేవి యడుగఁగా ఆ చిన్నదాని వృత్తాంతమును విష్ణువు చెప్పెను. అంతట లక్ష్మీదేవి విష్ణు మూర్తివాక్యమునువిని యాచిన్నదానికి మోక్షమేతీరున కలుగునో చెప్పుమనెను.

శ్రీభగవానువాచ:– శ్లో॥ ఊర్జేమాసేసితేపక్షే ద్వాదశ్యా మస్తియద్వ్రతం। తద్వ్రతస్యఫలంకించి ద్దాతుమర్హసి శోభనే॥ ఇక్షు బిందుఫలేనైవ ముచ్యతేపాపబంధనాత్॥

తా॥ విష్ణుమూర్తి చెప్పుచున్నాడు. కార్తీకమాస శుక్లపక్ష ద్వాదశియందుఁ జేయగగిన యేవ్రతముకలదో, ఓమంగళప్రదులారా

ఆ వ్రతముయొక్క ఫలమును గొంచెమీకీటకమున కిమ్మా చెఱుకుగడ నుండి దేహముపై (బడిన బిందువుల యొక్క ఫలముచేత ఈ జన్మమును విడుచును.

శ్లో॥ తథేతి శ్రీర్దదాతస్యై కీటోఽపిస్త్రీత్వమావహత్॥

తా॥ లక్ష్మీదేవి యాలాగుననే యా వ్రతమాచరించి ఆ బిందు ఫలమును దానికొసంగిచ్చెను. ఆ పురుగు ఆ ఫలమువల్లను స్త్రీరూపము బొందెను.

స్త్రీప్రాహ:- శ్లో॥ అద్యమేసఫలంజన్మ జీవితంచ సుజీవితమ్।
వ్రతాని సఫలాన్యద్య భవత్పాదాబ్జదర్శనాత్॥
శ్లో॥ ఇతిస్తుత్వాఽథసానారీ శ్రియం ప్రాహముదాన్వితా ।
అహమేతద్వ్రతందేవి కరిష్యామి వదస్వమే॥

తా॥ స్త్రీ చెప్పుచున్నది. ఓ లక్ష్మీదేవి! నీ పాదపద్మములను జూచుటచే నాజన్మ సఫలమైనది. ఈ ప్రకారముగా లక్ష్మీదేవినిస్తోత్ర ముచేసి యా చిన్నది సంతోషముతో ఓ లక్ష్మీ! యీ వ్రతమును నేను జేసెదను. నాకు జెప్పుమని యడిగెను.

దేవ్యువాచ:-శ్లో॥ కార్తికేచసితేపక్షే ఏకాదశ్యాముపోష్యచ ।
తులసింపూజయిత్వాఽథ పంచవర్ణైశ్చచూర్ణకైః॥
పంచపద్మైరలంకృత్య ధూపదీపాదిభిఃక్రమాత్ ।
రాత్రౌజాగరణంకృత్వా పురాణపఠనాదిభిః॥

తా॥ లక్ష్మీదేవి చెప్పుచున్నది. కార్తీకశుక్ల ఏకాదశియందు నుపవాసము చేసి ఐదువర్ణములుగల ముగ్గులచే నయిదు పద్మముల నుంచి తులసిని బూజించి ధూపదీపాదులను గ్రమముగానిచ్చి రాత్రి యందుఁ బురాణము చదువుట మొదలైనవానిచే జాగరణము చేయ వలయును.

శ్లో॥ తతఃప్రభాతవేళాయాం స్నాత్వాధృత్వాంబరంశుచి।తుల సీంపూర్వవత్పూజ్య కృత్వావై పిష్టకత్రయమ్ ॥ ఏకంతులస్యాఏకంతు బ్రాహ్మణాయనివేదయేత్ । అవశిష్టంతుయచ్చైకం నిధాయోలూ ఖలేపయః। ప్రోక్ష్యేక్షుమూలైర్నారీసా హన్యాత్తుప్రాణ్యాంగానాన్వితా॥

తా॥ తరువాత ప్రాతఃకాలమందులేచి స్నానముచేసి శుభ్రమైన వస్త్రమునుధరించి పూర్వప్రకారముగాఁ దులసిని బూజించి మూడు చలిమిడుండలుచేసి యొకముద్దను తులసీసహితుఁడైన విష్ణునకు నివేదనముచేసి రెండవదానిని బ్రాహ్మణునకిచ్చి మూడవదానిని కోటిలోనుంచిపాలుపోసి చెఱకుగడయొక్క మూలముతో సువాసినీలతోఁ గూడి బిందువులు శిరస్సునసంబడునట్లుగా త్రొక్కవలెను.

శ్లో॥ కీర్తనీయామహావిష్ణోః కథా స్తల్లగ్నచేతసా॥

తా॥ ఆ చిలుకు త్రొక్కుసమయమున మనస్సును విష్ణువునందుంచి విష్ణుసంబంధమైన పాటలను పాడవలయును.

శ్లో॥ షడ్రసోపేతమన్నంచ దద్యాద్దక్షిణయాసహ।
స్వయం చాపిహిభుంజీయా దిష్టకామ్యార్థసిద్ధయే॥

తా॥ తలఁచినకోరిక సఫలమౌటకు నీరీతివ్రతమాచరించిషడ్రసోపేతమైన యన్నమును బ్రాహ్మణులచేభుజింపఁజేసి దక్షిణలనిచ్చి పిమ్మటఁ దాను భుజింపవలయును.

శ్లో॥ అబ్దాంతేత్వథవాచాంతే కుర్యాదుద్యాపనంముదా।
ఏవంపంచాబ్దపర్యంత మాచరేత్సుసమాహితా॥

తా॥ ఈప్రకారమయిదు సంవత్సరము లీవ్రతమాచరించి యానందముగలదై యయిదుసంవత్సరములలో మొదటనైన మధ్యమునందమంతైన నుద్యాపనచేయవలయును.

శ్లో॥ కుర్యాద్ద్విప్రతిమాంం విష్ణులక్ష్మ్యోర్విత్తానుసారతః। గోమయేనానువిధ్యాథ రంగవల్లింప్రకల్పయేత్॥ తన్మధ్యేపంచకుడుపాక్ సంస్థాప్య శ్వేతతండులాన్।నిక్షిప్యప్రతిమాయుగ్మం తత్రనారాయణం రమాం। లక్ష్మీనారాయణందేవం పూజయేద్భక్తిపూర్వకం॥

తా॥ తులసీసన్నిధానమందు గోమయముతోఁ జక్కఁగాఁనలికి చిత్రమైన ముగ్గులుపెట్టి యచ్చట నైదుమానికెల తెల్లని బియ్యముంచి దానిమధ్యఁ దనశక్తిననుసరించి చేయింపఁబడిన లక్ష్మీవిష్ణుప్రతిమల రెంటినుంచి భక్తిపూర్వకముగా లక్ష్మీనారాయణమూర్తిని బూజింపవలయును.

శ్లో॥ అఖండితంనవంవస్త్రం మేకైకస్యపృథక్పృథక్।గంధపుష్పా...

తైర్ధూపైర్దీపైర్నైవేద్యసంయుతైః ॥ నానావిధోపచారైశ్చ పూజయిత్వాయథావిధి । ప్రదక్షిణప్రణామాంశ్చ పంచపంచక్రమేణతు॥

తా॥ చించని నూతనవస్త్రముల ఒక్కొక్క ప్రతిమకు వేఱువేఱుగానుంచి గంధము, పుష్పములు, అక్షతలు, ధూపము, దీపము నైవేద్యము, తాంబూలము, నీరాజనము, మంత్రపుష్పము, మొదలైన నానావిధోపచారములచేత యథావిధిగాఁ బూజించి ఐదేసి ప్రదక్షిణములను నమస్కారములను జేయవలెను.

:ఉద్యాపన క్రమః :

శ్లో॥ ఊర్జేమాసేసితేపక్షే ఏకాదశ్యా ముపోషితః । ప్రాతస్స్నాత్వా శుచిర్భూత్వా రంగవల్లీం ప్రకల్పయేత్॥ సాయంకాలేతు సంప్రాప్తే శుచిర్భూత్వా సమాహితః॥

తా॥ ఉద్యాపనము చేయువారు కార్తికశుద్ధ యేకాదశిదినంబున ఉపోష్యముండి ఆదినంటున ప్రాతస్స్నానముచేసి పరిశుద్ధురాలై పూజాస్థలమును ముగ్గులచే అలంకరించి సాయంకాలముకాగానే పునః స్నానముచేసి పరిశుద్ధవస్త్రమునుధరించి ఈ వ్రతమును చేయవలెను.

శ్లో॥ మంటపేష్టదళంపద్మం పంచవర్ణైస్సుశోభితమ్। వితానమిక్షు దండైశ్చ కర్ణికారైస్సుశోభితం। తన్మధ్యేవస్త్రమాస్తీర్య తండులాన్ప్రస్థపంచకాన్। తన్మధ్యేకలశందివ్యం పంచపల్లవశోభితమ్॥

తా॥ ఆవేదికయొక్క మధ్యమందు నెనిమిది దళములు కలిగినటువంటిదియు, అయిదువర్ణములచేత ప్రకాశించు చున్నదియునగు పద్మమునులిఖించి చెఱుకుగడలచేత చాందినిగట్టి వానియొక్క మధ్యమందు దివ్యమైన నూతన వస్త్రమును బరచి అయిదుకుంచములు బియ్యము,పోసి ఆబియ్యముయొక్క మధ్యమునందు ఐదుపల్లవముల చేత ప్రకాసించుచున్న దివ్యమైన ఒక కలశమునుస్థాపించి,

శ్లో॥ ప్రతిమా శోధనంకృత్వా నిక్షిప్యకలశోపరి। ఐతద్వ్రతస్య కలశాన్। పంచదశంచ సంఖ్యయా। కలశోపరివస్త్రాణి నిక్షిపేత్పూజనం క్రమాత్॥ ప్రాణప్రతిష్ఠాంకుర్వీతషోడశైరుపచారకైః యామేయామేతు పూజాంచ కుర్యాజ్జాగరణం నిశి॥

తా॥ పిమ్మట ప్రతిమాశోధనముచేసి లక్ష్మీనారాయణ ప్రీతి

కొఱకు పంచదశ కలశములను ప్రతిష్ఠించి ఆకలశములయందు నూతన వస్త్రములనుంచి పిమ్మటఆవస్త్రముల పై భాగమందు ప్రతిమలనుంచియ థాక్రమముగా ప్రాణప్రతిష్ఠాపనము మొదలు షోడశోప చారములచే లక్ష్మీనారాయణమూర్తిని పూజచేసి రాత్రియందు నాలుగు యామ ములు పూజచేయుచు రాత్రియందంతయు జాగరముఁజేయవలెను.

శ్లో॥ నృత్తగీతాదివాద్యైశ్చ పురాణశ్రవణేనచ। సద్గోష్ఠీవేద ఘోషైశ్చ కుర్యాజ్జాగరణంనిశి। పరేఽహ్ని ప్రాతరుత్థాయకుర్యాద్వై దంతధావనమ్। నద్యాంస్నాత్వాద్విజవరైః ప్రవిశేద్గృహముత్తమమ్॥

తా॥ నృత్తగీతవాద్యములచేతను పురాణశ్రవణము చేతను సత్పురుషులయొక్క గోష్ఠిచేతను వేదనాదముచేతను రాత్రి జాగరణ ముఁజేసి మఱునాడుప్రాతః కాలమందు లేచి దంతధావనాది కృత్యము లనుదీర్చి నదిలోస్నానము చేసి బ్రాహ్మణులయొక్క స్వస్తివాచనము తోఁగూడ గృహమును బ్రవేశింపవలెను.

శ్లో॥ నారాయణస్య గాయత్ర్యా హోమమష్టోత్తరం శతమ్। తతోజయాదిహోమంచ పూర్ణాహుతిరనంతరమ్॥ గోదానాదిదశదానా నికారయేద్వ్రతముత్తమం.

తా॥ నారాయణగాయత్రీ మంత్రముచే ౧౦౮ మాఱులు హోమమునుజేయవలెను. అనంతరంబున జయాదిహోమమును పిమ్మట పూర్ణాహుతిని గోదానము మొదలగునవి జేయవలెను.

శ్లో॥ పునఃపూజాంచనైవేద్యం ధూపనీరాజనాదిభిః। క్షమార్ప ణంచకుర్వీత స్తోత్రైర్నానావిధైరపి॥

తా॥ తిరిగి ధూపదీపనైవేద్యములచేత పునః పూజచేసి నానా విధస్తోత్రములచేత క్షమార్పణముఁ జేయవలెను.

శ్లో॥ సువాసినీద్వయం పంచదశబ్రాహ్మణసత్తమాన్। కృత్వా తుష్టాన్భోజనాద్యై ర్వస్త్రైశ్చవిశేషత॥ బ్రాహ్మణాన్ భోజయే త్పశ్చాత్స్వయంభుంజీతబంధుభిః॥

తా॥ అనంతరమందిద్దరు సువాసినీలను శ్రేష్ఠులైన పదునైదు గురు బ్రాహ్మణులను మఱియునితరులైన బ్రాహ్మణులను వస్త్రములు

దక్షిణలు భోజనము మొదలైనవానిచేఁ దృప్తిఁబొందించి పిమ్మటఁ దానుబంధువులతోఁగూడి భుజింపవలయును.

శ్లో॥ ఏవంశక్త్యనుసారేణ విత్తశాఠ్యంనకారయేత్ ।
నోద్యాపయేద్వ్రతంయస్తు పునఃకీటోభవిష్యతి ॥

తా॥ ఈ ప్రకారముగాఁ దనశక్తిననుసరించి ద్రవ్యలోపము లేనట్లుగాఁజేయవలయును. ఎవఁడీవ్రతమాచరించి యుద్యాపనచేయఁడో ఆ నరుఁడు తిరిగి పురుగై జన్మించును.

శ్లో॥ ఏవమాచరితంయైస్తు సర్వాభీష్టప్రదంవ్రతమ్।
తేషాంభుక్తిశ్చముక్తిశ్చ భవేత్యత్ర నసంశయః॥

తా॥ ఈ ప్రకారముగా నన్నికోరికలను ఫలింపఁజేయునట్టి యీ వ్రతము నెవరుచేయుదురో వారికి నిహలోకమున భుక్తియుఁ బరలోకమున ముక్తియుఁగలుగును. సందేహములేదు.

శ్లో॥ ఇత్యుక్త్వాఽథమహాలక్ష్మీ రంతర్ధానంయయౌతదా ॥

తా॥ ఈ ప్రకారముగా నాలక్ష్మీదేవి చెప్పి యంతర్ధానమాయెను.

శ్లో॥ ఏవంక్రమేణసాకన్యా కృత్వావ్రతమనుత్తమమ్ ।
ఇహాభుక్త్వాఽధికసుఖం అంత్యే స్వర్గంజగామహ॥

తా॥ ఆ చిన్నది యిట్లు లక్ష్మీదేవివల్ల శ్రేష్ఠమైన చిలుకుద్వాదశీవ్రతమును విని తాను యథావిధిగాఁజేసి యీలోకమున విశేషమైన సుఖమనుభవించి మృతినొందినపిమ్మట స్వర్గలోకమును బొందెను.

శ్లో॥ యేపఠంతీదమాఖ్యానం శృణ్వంతి శ్రద్ధయాన్వితాః ।
తేసర్వేపాపనిర్ముక్తా యాస్యంతి పరమాంగతిమ్ ॥

తా॥ ఎవరీకథను జదువుచున్నారో శ్రద్ధకలవారై వినుచున్నారో వారు సమస్తపాపములను బోగొట్టుకొని దుర్లభమైన మోక్షమును బొందుచున్నారు.

ఇతి శ్రీస్కాందపురాణోక్త చిలుకు ద్వాదశీ వ్రతకల్ప

స్సంపూర్ణః.

---

ఓం

పరబ్రహ్మణే నమః.

# వరలక్ష్మీ వ్రతకల్పము.



ఈ వ్రతము ప్రతి సంవత్సరము శ్రావణ శుక్ల పూర్ణిమకు సమీపమందున్న శుక్రవారదినమం దాచరింపవలయును.

అథ ప్రాగ్దేశే గోమయేనానులిప్య । రంగవల్ల్యాదిభిరలంకృత్య తదుపరి పీఠంనిక్షిప్య । తదుపర్యష్టదళపద్మంలిఖిత్వా । తత్ర నూతన వస్త్ర మాపాద్య । తదుపరి యథాశక్తితండులాన్నిక్షిప్య । తత్ర తామ్రనిర్మిత ప్రధానకలశంనిధాయ । తత్కలశే తండులాన్నిధాయ। తదుపరి పంచపల్లవాని నారికేళంచ నిక్షిప్య॥ తత్ర కంచుకం సువర్ణ ప్రతిమాంనిధాయ । మంటపస్య దక్షిణభాగే అఖండదీపారాధనం కుర్యాత్॥ (అత్ర సంకల్పః) ఆచమ్య...ఏవంగుణ...శుభతిథౌ... మమాచరిత వ్రతకల్పోక్త సంపూర్ణ సకలఫలావాప్త్యర్థ్యం సత్సంతాన సౌభాగ్యశుభఫలావాప్త్యర్థం వర్షే వర్షే ప్రయుక్త మహాలక్ష్మీ వరలక్ష్మీముద్దిశ్య శ్రీ మహాలక్ష్మీ వరలక్ష్మీ ప్రీత్యర్థం అద్య అఖండ దీపారాధనం కరిష్యే॥ శ్లో॥ ఘృతాక్తవర్తిసంయుక్త మంధకార వినాశనం । దీపందాస్యామి తేదేవి గృహాణ ముదితాభవ॥ మంత్రః॥ ఓం ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నన్నిరృతిం మమ । పశూగ్ంశ్చమహ్యమావహ జీవనంచదిశోదిశ॥ ప్రణమ్య॥ తతః గణాధిపతిపూజాంచకుర్యాత్ శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా। తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతోజయమంగళం॥ శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥ ...సర్వేభ్యో మహాజనేభ్యోనమః॥ ఆచమ్య ॥ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ... అస్మాకం సహకుటుంబానామ్ క్షేమస్థైర్య విజయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామ్య మోక్ష చతుర్విధఫలపురుషార్థ సిద్ధ్యర్థం-ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య శుభఫలా వాప్త్యర్థం వర్షే వర్షే సంయుక్త శ్రీమహాలక్ష్మీ ముద్దిశ్య శ్రీ మహాలక్ష్మీ వరలక్ష్మీ ప్రీత్యర్థం యావచ్ఛక్త్యా

ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥ (ఇతి సంకల్ప్య) ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే ॥ విధిప్రకారేణ గణాధిపతిపూజాంచ కుర్యాత్ ॥ పునస్సంకల్ప్య ఏవంగుణ ... శుభతిథౌ ॥ అస్మాకం సహకుటుంబానాం ... ర్థం శ్రీ వరలక్ష్మీ పూజాం కరిష్యే ॥ పూజాంగత్వేన ప్రతిమాశోధనం కరిష్యే ॥ శ్లో॥ దధిసర్పిర్మధుక్షీరై శ్శర్కరేణఫలైస్సహ । ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాంశోధయేత్తతః॥ మంత్రః॥ ఆప్యాయస్వ ... ... సంగథే॥ దధిక్రావ్ణ్ణో అకా... తారిషత్ ॥ శుక్రమసి... శర్మభిః ॥ మధువాతాభవంతునః॥ తాశ్శర్కరాఽభవన్ ... పశుకామస్య॥ యాఃఫలినిర్యా... త్వంగ్ హసః ॥ ఆపోహిష్టామయోభువ... ఆపోజనయథా చనః॥ ఇతి పంచామృతేన శుద్ధోదకేనప్రక్షాళ్య ॥ ఆదౌగణపతిమావాహ్య ॥ శ్లో॥ ఉత్తమాగణనాథస్య పూజా సంపత్కరీశుభా । భక్తాభీష్ట ప్రదాతస్మాద్ధ్యాయేత్తం విఘ్ననాయకమ్ ॥ మం ॥ గణానాంత్వా... సాదనం ॥ గణపతిమా... మి ॥ అథపీఠపూజాం కరిష్యే॥ ఓం ఐం హ్రీం శ్రీం కాలాగ్ని రుద్రాయనమః, ...మండూకాయ నమః, ...ఆధారశక్త్యైనమః, ...కూర్మాయనమః, ...వరాహాయనమః, ...అనంతాయనమః, ...యజ్ఞవరాహాయనమః, ...ఆంజనేయాయ నమః, ...పృథివ్యైనమః, ...శతకందాయనమః, ...సంవహ్నిళాయ నమః, ...రత్నపత్రేభ్యోనమః, ...రత్నదళాయనమః, రత్నకేసరేభ్యోనమః, ...రత్నకర్ణికాయనమః,॥ పూర్వాది చతుర్దిక్షు। ... ధర్మాయనమః...జ్ఞానాయనమః,...వైరాగ్యాయనమః...ఐశ్వర్యాయ నమః, ఆజ్ఞేయాదివిదిక్షు॥ అధర్మాయనమః, ...అజ్ఞానాయనమః, ...అవైరాగ్యాయనమః, ...అనైశ్వర్యాయనమః, పీఠమధ్యే॥ రం- వహ్నిమండలాయనమః, హం- సూర్యమండలాయనమః, సం- సోమమండలాయ నమః, తం- తపసేనమః, రం- రజసే నమః, సం-సత్వాయ నమః, ఆం- ఆత్మనే నమః, అం- అంతరాత్మనేనమః, పం-పరమాత్మనేనమః, హ్రీం-జ్ఞానాత్మనేనమః, ఓం నమోభగవతే సకలగుణాత్మకశక్తియుక్తాయ యోగపీఠాయనమః, అథ వరలక్ష్మీప్రతిమామాదాయ॥ శ్లో॥ పద్మాసనేపద్మకరే సర్వలోకైకపూజితే।

నారాయణ ప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా ॥
మంత్రః॥ సక్తుమివతిత... వాచి ॥ శ్రీ వరలక్ష్మీ మావాహయామి
స్థాపయామి పూజయామి ॥ ఇతి కలశవస్త్రోపరి తత్ప్రతిమాంనిధాయ॥
(ఇంద్రాద్యష్టదిక్పాలక పూజాంచ కేచిత్కుర్వంతి, గ్రంథవిస్తరభ
యా న్నలిఖ్యతే) పునః ఆచమ్యఏవంగుణ...ర్థం కల్పోక్త విధిప్రకారేణ
యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥
తదంగ కలశారాధనంకరిష్యే॥ శ్లో॥ కలశస్యముఖేరుద్రః కంఠేవిష్ణుస్స
మాశ్రితః । మూలేతత్రస్థితో బ్రహ్మా మధ్యేమాతృగణాస్స్మృతాః ॥
కుక్షౌతు సాగరాస్సర్వే కలశాంబుసమాశ్రితాః ॥ మం॥ ఆకలశేషుధా
వతి పవిత్రేపరిషిచ్యతే...రాపఠమ్ ॥ శ్లో ॥ గంగేచయమునే... సన్ని
ధింకురు ॥ కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య॥ దేవమాత్మానంచ
సంప్రోక్ష్య ॥ అథ ప్రాణప్రతిష్ఠాపనంకుర్యాత్ ॥ మం ॥ అసునీతేపు
నరస్మాసు...ముపహ్వాయతే ॥ స్థిరోభవ । వరదోభవ। సుముఖోభవ।
సుప్రసన్నోభవ। మమాభిముఖోభవ। స్థిరాసనంకురు॥ అథధ్యానం శ్లో॥
క్షీరోదార్ణవసంభూతే కమలేకమలాలయే। సుస్థిరాభవమేగేహే సురా
సుర నమస్కృతే ॥ శ్రీవరలక్ష్మీదేవ్యైనమః । ధ్యానంసమర్పయామి
శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే విష్ణువక్షస్స్థలాలయే। ఆవాహయామి
దేవిత్వాం సుప్రీతాభవసర్వదా॥ శ్రీవరలక్ష్మీ...ఆవాహనంసమర్ప
యామి ॥శ్లో॥ సూర్యాయుతనిభస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితం ।
సింహాసన మిదందేవి స్థీయతాంసుర పూజితే॥ శ్రీ సింహాసనంసమర్ప
యామి ॥ శ్లో॥ శుద్ధోదకంచపాత్రస్థం గంధపుష్పాదిమిశ్రితం। అర్ఘ్యం
దాస్యామితేదేవి గృహాణసురపూజితే ॥శ్రీ...అర్ఘ్యం సమర్పయామి
శ్లో॥ సువాసితజలంరమ్యం సర్వతీర్థసముద్భవం । పాద్యం గృహాణదేవి
త్వం సర్వదేవనమస్కృతే శ్రీ...పాద్యం సమర్పయామి శ్లో॥ సువర్ణ
కలశానీతం చందనాగరుసంయుతం। గృహాణాచమనందేవి మయా
దత్తం శుభప్రదే ॥ శ్రీ ఆచమనీయం సమర్పయామి ॥శ్లో। పయోదధి
ఘృతోపేతం శర్కరామధుసంయుతం। పంచామృతస్నానమిదం గృ
హాణకమలాలయే ॥ ... ... ... పంచామృతస్నానం సమర్పయామి
శ్లో॥ గంగాజలం మయానీతం మహాదేవ శిరస్థితమ్

శుద్ధోదకస్నానమిదం గృహాణవిధుసోదరి ॥ ...శుద్ధోదకస్నానం సమర్పయామి ॥ శ్లో॥ సురార్చితాంఘ్రియుగళే దుకూలవసనప్రియే। వస్త్రయుగ్మంప్రదాస్యామి గృహాణహరివల్లభే ॥ వస్త్రం సమర్పయామి ॥ శ్లో॥ కేయూరకంకణేదివ్యే హారనూపురమేఖలాః । విభూషణాన్యమూల్యాని గృహాణఋషిపూజితే ॥ ఆభరణాని సమర్పయామి ॥ శ్లో॥ తప్త హేమకృతంసూత్రం ముక్తాదామవిభూషితం । ఉపవీతమిదం దేవి గృహాణత్వం శుభప్రదే ॥ ఉపవీతం సమర్పయామి ॥ శ్లో॥ కర్పూరగరుకస్తూరీ రోచనాదిభిరన్వితం । గంధందాస్యామ్యహం దేవి ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥ గంధం సమర్పయామి ॥ శ్లో॥ అక్షతాం ధవళాం దేవిశాలీయాన్ తండులాన్ శుభాన్ । హరిద్రాకుంకుమోపేతా న్గృహ్యతామబ్ధి పుత్రికే॥ అక్షతాన్ సమర్పయామి॥ శ్లో॥ మల్లికాజాజికుసుమైశ్చంపకై ర్వకుళైస్తథా। శతపత్రైశ్చకల్హారైః పూజయామి హరిప్రియే॥ పుష్పైః పూజయామి॥ అథాంగపూజా॥ చంచలాయైనమః—పాదౌ పూజయామి, చపలాయైనః— జానునిపూజయామి, పీతాంబరాయనమః— ఊరూపూజయామి, కమలవాసిన్యైనమః— కటింపూజయామి, పద్మాలయాయైనమః— నాభిం పూజయామి, మదనమాత్రే నమః— స్తనౌపూజయామి, లలితాయైనమః— భుజద్వయ పూజయామి,కంబుకంఠ్యైనమః— కంఠం పూజయామి, సుముఖాయైనమ— ముఖం పూజయామి, శ్రియైనమః— ఓష్ఠౌపూజయామి. సువాసికాయైనమః— నాసికాం పూజయామి, సునేత్ర్యైనమః— నేత్రే పూజయామి, రమాయైనమః— శిరః పూజయామి. శ్రీవరలక్ష్మ్యై నమః— సర్వాణ్యంగాని పూజయామి.

## అథ అష్టోత్తర శతనామ పూజా.

ఐం హ్రీం శ్రీం ప్రకృత్యైనమః। ...వికృత్యైనమః। ... ... విద్యాయైనమః । సర్వభూతహితప్రదానయైనః । శ్రద్ధాయైనమః । విభూత్యైనమః । సురభ్యైనమః । పరమాత్మికాయైనమః । వాచేనమః । పద్మలయాయైనమః। పద్మాయైనమః శుచయేనమః ।స్వాహాయైనమః । స్వధాయైనమః । సుధాయైనమః । ధన్యాయైనమః । హిర

ణ్మయైనమః । లక్ష్మ్యైనమః । నిత్యపుష్టాయైనమః । విభావర్యైనమః ।
ఆదిత్యై నమః । దిత్యై నమః । దీప్తాయై నమః । రమా
యై నమః । వసుధాయై నమః । వసుధారిణ్యైనమః । కమ
లాయై నమః । కాంతాయై నమః । కామాక్ష్యై నమః ।
క్రోధసంభవాయైనమః । అనుగ్రహప్రదాయైనమః। బుద్ధయే నమః ।
అనఘాయై నమః । హరివల్లభాయైనమః । అశోకాయైనమః ।
అమృతాయైనమః । దీప్తాయైనమః । లోకశోకవినాశిన్యైనమః। ధర్మ
నిలయాయైనమః । కరుణాలోకమాత్రేనమః । పద్మప్రియాయైనమః।
పద్మహస్తాయైనమః । పద్మాక్ష్యైనమః । పద్మసుందర్యైనమః। పద్మో
ద్భవాయైనమః । పద్మముఖ్యైనమః। పద్మనాభప్రియాయైనమః।వరా
రోహాయైనమః । పద్మమాలాధరాయైనమః। దేవ్యైనమః । పద్మిన్యై
నమః । పద్మగంధిన్యైనమః । పుణ్యగంధాయైనమః । సుప్రసన్నాయై
నమః । ప్రసాదాభిముఖ్యైనమః। ప్రభవాయైనమః। చంద్రవదనాయై
నమః। చంద్రాయైనమః। చంద్రసహోదర్యైనమః।చతుర్భుజాయైనమః
చంద్రరూపాయైనమః । ఇందిరాయైనమః । ఇందుశీతలాయైనమః ।
ఆహ్లాద జనన్యైనమః । పుష్ట్యైనమః । శివాయైనమః। శివకర్యైనమః।
సత్యైనమః । విమలాయైనమః । విశ్వజనన్యైనమః । తుష్టాయైనమః।
దారిద్రనాశిన్యైనమః । ప్రీతిపుష్కరిణ్యైనమః । శాంతాయైనమః ।
శుక్లమాల్యాంబరాయైనమః । శ్రియైనమః । భాస్కర్యైనమః। బిల్వ
నిలయాయైనమః । యశస్విన్యైనమః । వసుంధరాయైనమః । ఉదా
రంగాయైనమః । హరిణ్యైనమః । హేమమాలిన్యైనమః । ధనధాన్య
సిద్ధ్యైనమః । సిద్ధయేనమః । స్త్రైణసౌమ్యాయైనమః । శుభవరాయై
నమః । నృపవేశ్మగతాయైనమః। వరలక్ష్మ్యైనమః । వసుప్రదాయై
నమః । శుభవరాయైనమః । హిరణ్యప్రాకారాయైనమః। సముద్రతన
యాయైనమః । జయాయైనమః । మంగళాయైనమః । దేవ్యైనమః ।
విష్ణువక్షస్థలస్థితాయైనమః । విష్ణుపత్న్యైనమః । ప్రసన్నాక్ష్యైనమః ।
నారాయణసమాశ్రితాయైనమః । దారిద్ర్యధ్వంసిన్యైనమః । దేవ్యై
నమః । సర్వోపద్రవవారిణ్యైనమః। నవదుర్గాయైనమః।మహాకాళ్యై

నమః। బ్రహ్మ విష్ణు శివాత్మికాయైనమః । త్రికాల జ్ఞానసంపన్నాయై నమః । భువనేశ్వర్యైనమః ॥

శ్లో॥ దశాంగంగుగ్గులూపేతం సుగంధంచసుమనోహరం। ధూపం దాస్యామి దేవేసి వరలక్ష్మీగృహాణతమ్॥ ధూప... మి॥ శ్లో॥ ఘృతాక్త వర్తిసంయుక్త మంధకార వినాశనం। దీపందాస్యామి తేదేవి గృహాణ ముదితాభవ॥ ...దీపందర్శయామి॥ శ్లో॥ నైవేద్యంషడ్రసోపేతం దధిమధ్వాజ్యసంయుతం। నానాభక్ష్యఫలోపేత గృహాణహరివల్లభే॥ నైవేద్య..., మి॥ శ్లో॥ ఘనసారసుగంధేన మిశ్రితంపుష్పవాసితం। పానీయం గృహ్యతాందేవి శీతలంసుమనోహరమ్ ॥ పానీయం... మి॥ శ్లో॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం । కర్పూరచూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥ తాంబూలం... మి॥ శ్లో॥ నీరాజనం సమానీతం కర్పూరేణసమన్వితం। తుభ్యందాస్యామ్యహందేవి గృహ్యతాం విష్ణువల్లభే ॥ నీరాజనం ...మి ॥ పద్మాసనే పద్మకరే సర్వలోకైకపూజితే। నారాయణప్రియేదేవీ సుప్రీతాభవసర్వదా॥ మంత్రపుష్పం... మి॥ శ్లో॥ యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ। తానితానిప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే । ప్రదక్షిణనమస్కారాన్ ... మి। శ్లో॥ నమస్తేలోకజనని నమస్తే విష్ణువల్లభే। త్రాహిమాం భక్తవరదే వరలక్ష్మ్యై నమోనమః ॥ ఇతి ప్రార్థనం ॥ శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరీ । యత్పూజితం మయాదేవీ పరిపూర్ణం తదస్తుతే॥ అనయాధ్యానావాహనాది షోడశోపచారపూజయా...... వరదాభవతు ॥ ఆచరిత వ్రత కల్పోక్త...రస్తు ॥ ఆచమ్య...ప్రీత్యర్థ మర్ఘ్యప్రదానానికరిష్యే శ్లో॥ గంధపుష్పాక్షతైర్యుక్తం శుద్ధోదకసమన్వితం। అర్ఘ్యందాస్యామితేభక్త్యా పాతివ్రత్యంప్రయచ్ఛమే । శ్రీవరలక్ష్మీదేవతాయై నమః । ఇద మర్ఘ్యంసమర్పయామి । నవార్ఘ్యాణి దద్యాత్ । అనేన...శ్రీవరలక్ష్మీ దేవతా... భవత్ ।

అథ తోరగ్రంథి పూజా.

కమలాయైనమః । ప్రథమగ్రంథిం పూజయామి, రమాయైనమః ద్వితీయగ్రంథిం పూజయామి. లోకమాత్రేనమః - తృతీయ గ్రంథి

పూజయామి, విశ్వజనన్యైనమః- చతుర్థగ్రంథిం పూజయామి, మహాలక్ష్మ్యైనమః- పంచమగ్రంథిం పూజయామి, క్షీరాబ్ధితనయాయైనమః- షష్ఠమగ్రంథిం పూజయామి, విశ్వసాక్షిణ్యై నమః- సప్తమగ్రంథిం పూజయామి, హరివల్లభాయైనమః- అష్టమగ్రంథింపూజయామి, చంద్రసోదర్యైనమః- నవమగ్రంథం పూజయామి ॥

అథ తోరబంధనమ్.

శ్లో॥ బధ్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం । పుత్రపౌత్రాభివృద్ధించ సౌభాగ్యందేహిమేరమే ॥ ఈ మంత్రపఠనము సేయుచు తోరము కట్టుకోవలయును.

అథ వాయన విధిః

శ్లో॥ ఏవంసంపూజ్యకళ్యాణీం వరలక్ష్మీస్స్వశక్తితః । దాతవ్యం ద్వాదశాపూపం వాయనంహిద్విజాతయే ॥

అథ వాయన దానమ్.

శ్లో॥ ఇందిరాపతి గృహ్ణాతు ఇందిరావైదదాతిచ। ఇందిరాతారకోభాభ్యా మిందిరాయైనమోనమః ॥

ఇతి వరలక్ష్మీ పూజావిధానం సంపూర్ణమ్.

---

ఈవరలక్ష్మీవ్రతము శ్రావణ శుక్ల ౧౫ కు సమీపదినమునందుండు శుక్రవారదినము ప్రాముఖ్యము. దైవీకము వలన పూర్ణిమకు ముందుండు శుక్రవారము వీలుపడని యెడల పూర్ణిమ వెళ్ళిన పిమ్మట వచ్చేశుక్రవార దినమునందయినను జరుపవలెను. గాని యీ వ్రతమును మానివేయకూడదు శ్రీ. శ్రీ. శ్రీ.

# అథ కథా ప్రారంభః

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే నానాగణనిషేవితే । మందారవటపాక్రాంతే నానామణి విభూషితే।పాటలీశోక పున్నాగ ఖర్జూర వకుళా

న్వితే। కుబేర వరుణేంద్రాది దిక్పాలైశ్చ సమావృతే। నారదాగస్త్య వాల్మీకి పరాశరసమావృతే। రత్నపీఠేసుఖాసీనం శంకరంలోకశంకరం। పప్రచ్ఛగౌరీసంతుష్ట లోకానుగ్రహకామ్యయా॥

తా॥ నారదుఁడు మొదలయిన ఋషిశ్రేష్ఠులచేతను, కుబేరుడు మొదలగు దిక్పాలకులచేతను, ప్రమథాదిగణముల చేతను సేవింపఁబడి పాటలీ వృక్షములు, అశోక వృక్షములు, సురపొన్నలు, పొగడలు, మల్లెలు, మామిళ్ళు మొదలయిన సమస్త వృక్షములతోఁ గూడుకొని యున్న కైలాస పర్వత శిఖరము నందుండెడు మందారవృక్ష సమీపమున వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య మూక్తి గాది నానామణులచేత నేర్పరుపఁబడియుండెడు పీఠమునందు సుఖాసీనుండై యున్న శ్రీ మహాదేవుని సమస్త జనులకు క్షేమము గలుగ జేయుటకు గాను పార్వతీదేవి యొక ప్రశ్న చేసెను

శ్లో॥ భగవన్ సర్వలోకేశ సర్వభూత హితేరత। యద్రహస్యమిదంపుణ్యం తదాచక్ష్వమహానఘ॥

తా॥ సమస్త ప్రపంచమునకుఁ ప్రభుఁడవై సమస్త జనులకు క్షేమమును గలుగజేసెడి యో పరమేశ్వరుఁడా! అత్యంతరహస్యమైన పుణ్యాకరమైన వ్రతమును నాకు దెలుపుమని పార్వతీదేవి ప్రశ్నజేయగా పరమేశ్వరుఁడు చెప్పుచున్నాడు.

ఈశ్వర ఉవాచ॥ శ్లో॥ వ్రతానాముత్తమం నామ సర్వసౌభాగ్య కారణం। సర్వసంపత్ప్రదంశీఘ్రం పుత్రపౌత్రప్రవర్ధనం॥ వరలక్ష్మీవ్రతంనామ వ్రతమస్తిమనోహరం। శుక్లశ్రావణికేమాసి పూర్ణిమాపాంత్యభార్గవే। యదాతునారీచర్తేత వ్రతేతస్యాఃఫలంశృణు॥

తా॥ ఓ పార్వతీ! వినుము సమస్తవ్రతములలో సర్వోత్తమమైనదియు, అతి త్వరితముగా సమస్తైశ్వర్యములను బుత్రపౌత్రాభివృద్ధిని గలుగజేసెడు వరలక్ష్మీవ్రతమను పేరుగలిగిన యొకయుత్తమ వ్రతముకలదు ఆవ్రతమును శ్రావణశుక్ల పూర్ణిమకు సన్నిహితముగా బూర్వమందుండెడు శుక్రవారమునందు ఏస్త్రీభక్తితో వరలక్ష్మీవ్రతం నాచరింపుచున్నదో యాస్త్రీకత్యంతమైన శుభఫలము కలుగుచున్నది.

పార్వత్యువాచ ॥ శ్లో॥ విధినా కేన కర్తవ్యం తత్రికానామ దేవతా । కయాచారాధితాపూర్వం సాభూత్సంతుష్టమానసా ॥

తా॥ ఓ శంకరుఁడా! ఆ వ్రత మేవిధిప్రకార మొనర్పవలెను. అందు కారాధింప వలసిన దేవత యెవరు? ముందెవరిచేత నా దేవత పూజింప బడ్డదై సంతుష్టిని జెందిన దాయెనని యడుగఁగ ఈశ్వరుఁడు చెప్పుచున్నాఁడు.

ఈశ్వరఉవాచ॥ శ్లో॥ వరలక్ష్మీవ్రతంపుణ్యం వక్ష్యామిశ్రుణు పార్వతి। కుండినం నామ నగరం సర్వమండల మండితం॥ హేమప్రకార సంయుక్తం చామీకర గృహోజ్వలం । తత్రాభూద్బ్రాహ్మణీ కాచి న్నామ్నా చారుమతీశ్రుతా । పతిభక్తిరతా సాధ్వీ శ్వశ్రూ శ్వశుర యోర్ముదా । కళావతీసావిదుషీ సతతం మంజుభాషిణీ । తస్యాః ప్రసన్నచిత్తాయాః లక్ష్మీస్స్వప్నగతాతదా ॥

తా॥ ఓ పార్వతీ! ఆ పుణ్యాకరమయిన వరలక్ష్మీవ్రత ప్రభావ మును జెప్పుచున్నాను వినుము. కుండినమనెడి పేరుగల యొకపట్టణము గలదు. ఆ పట్టణము స్వర్ణమయమైన ప్రాకారముకలది అందుఁగల గృహములు స్వర్ణమయములుగానే యుండును. ఆ పట్టణము నందు చారుమతియను నొక్క బ్రాహ్మణస్త్రీ గలదు. ఆమె తన పెనిమిటిని దేవునితో సమానముగాఁబూజసేయుచు నత్తమామల శుశ్రూష మిక్కిలి యడకువతో జఱుపుచు నెల్లప్పుడు ప్రియముగాను మెల్లగాను మాట్లాడుచు సమస్త విద్యలయందును సమర్థురాలుగానుండెను. ఇట్లు నిష్కల్మషమానసురాలయిన యా చారుమతీదేవికి ఒకదినమునందు స్వప్నములో శ్రీమహాలక్ష్మి ప్రత్యక్షమై చెప్పుచున్నది. అదేమనగా!

శ్లో॥ ఏహికళ్యాణి భద్రంతే వరలక్ష్మి సమాగతా। నభోమాసే పూర్ణిమాయాం నాతిక్రాంతే భృగోర్దినే ॥ మత్పూజా తత్రకర్తవ్యా వరందాస్యామికాంక్షితం । ఇత్యుక్త్వావరలక్ష్మీసా సంతుష్టా పరయాముదా ॥

తా॥ ఓ చారుమతీ! ఇటు రమ్మా, నీకు క్షేమముగలుగుగాక. నేను వరలక్ష్మీదేవిని. నీకుఁబ్రత్యక్షమైతిని. శ్రావణమాసమందువచ్చెడు పూర్ణిమకు సన్నిహితముగాఁ బూర్వమందుండు శుక్రవారమున

భక్తితోఁబూజించుమా. అట్లు పూజఁజేసితివేని నీవు కోరినవరములను నీకిచ్చుచున్నాను. అని వరలక్ష్మీదేవిచెప్పఁగానే యాచారుమతి యాస్వప్నములోనే యామెను స్తోత్రముచేసినదామెను.

శ్లో॥ నమస్తేసర్వలోకానాం జనన్యైపుణ్యమూర్తయే। శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే ॥ త్వయావలోకితాస్సద్య స్సధవ్య స్సగుణాన్వితః । సశ్లాఘ్యస్సకుటుంబీచ సశూర స్సచపండితః ॥ జన్మాంతరసహస్రేషు కిం మయా సుకృతంకృతం । అత స్త్వత్పాద యుగళం పశ్యామి హరివల్లభే ॥

తా॥ సమస్త లోకములకుఁ దల్లివలె నుండి కాపాడుదానవై సమస్తజనులచేతఁ బూజింపఁబడుచు శ్రీమహావిష్ణు వక్షస్థలమందు నివసించియుండెడి యోమహాలక్ష్మీ! నీకు వందనముసమర్పించుచున్నాను. ఏ మనుజుఁడు నీ కటాక్షముచేతఁ జూడఁబడుచున్నాఁడో వాఁడు తత్క్షణమునందే ధనసంపన్నుఁడుగాను, అందఱిచేతఁ గొనియాడఁదగినవాఁడుగాను, పుత్రపౌత్రులతోఁజేరి బహుకుటుంబిగాను, మహాపండితుఁడుగానునగును. నేను తొల్లి యెన్ని వేలజన్మములందుఁజేసిన పుణ్యఫలముచేతనో నీపాదారవిందములను జూచునట్టిభాగ్యము నాకుసంభవించెను.

శ్లో॥ ఏవంస్తుతా సా కమలా పాదాత్తస్యై బహూన్ వరాన్। తతశ్చారుమతీ సాధ్వీస్వప్నాదుత్థాయసంభ్రమాత్। తత్సర్వంకథయామాస బంధూనాం పురతస్తదా॥

తా॥ ఇట్లు చారుమతీదేవిచేసిన నానావిధ స్తోత్రముల నాలకించి యావరలక్ష్మీదేవి చాలసంతోషించి చారుమతికి అనేకవరముల నిచ్చి యంతర్ధానమాయెను, అంతట చారుమతినిద్రమేల్కొని తాను కన్నస్వప్నవృత్తాంతమంతయు సంభ్రమముతోఁ దనబంధువులకు విశదంబుగా తెలిపెను.

శ్లో॥ శ్రుత్వాతు బాంధవాస్సర్వే సాధుసాధ్వితిచాబ్రువన్ । తద్దైవకరవామేతి తదాగమన కాంక్షిణః ॥

తా॥ పిమ్మట బంధువులందరు నా చారుమతీదేవి పలుకు లాల

కించి యీ స్వప్నము సర్వోత్తమమైనదనిపలికి యా లక్ష్మీకటాక్షమునుగోరి యీవ్రతాచారము తామునుచేసెదమని చెప్పిరి.

శ్లో॥ భాగ్యోదయేనసంప్రాప్తే వరలక్ష్మీదినేతథా। స్త్రీయం ప్రసన్నహృదయా నిర్మలాశ్చితవాససః॥ నూతనైస్తండులైః పూర్ణేకుంభేచ వటపల్లవైః। సాయంచారుమతీ ముఖ్యాశ్చక్రుః పూజాం ప్రయత్నతః

తా॥ అంతట కొన్నిదినములకు వారిభాగ్యోదయమువలన నా వరలక్ష్మీవ్రతదినమురాగానే యా స్త్రీలందరు నానంద భరితాంతఃరంగు లయిన నానావిధములయిన పరిశుద్ధ వస్త్రములు ధరించుకొని క్రొత్త బియ్యముతో నిండింపఁబడి మఱ్ఱిచిగుళ్ళుగల కలశము నేర్పరచి యా కలశమునందు వరలక్ష్మీదేవిని నావహింపజేసి చారుమతి మొదలగు సకలస్త్రీలు పతిభక్తితో సాయంకాలమునందు బూజచేసినవారైరి.

శ్లో॥ పద్మాసనేపద్మకరే సర్వలోకైకపూజితే। నారాయణప్రియే దేవి సుప్రీతా భవసర్వదా। ఇత్యావిమంత్రైస్సకలా నుపచారాన్ యథాక్రమాత్। కృత్వాతు దక్షిణేహస్తే నవసూత్రం దధుస్త్రియః। హావిష్యం సఘృతం చైవ వరలక్ష్మ్యైః నివేదయన్॥

తా॥ శ్రీమన్నారాయణమూర్తికిఁ బ్రియురాలవై యెల్లప్పుడు పద్మయందునివసించి పద్మములను హస్తమందు ధరించి సమస్తజనుల చేత నెల్లప్పుడు నారాధింపబడుచున్నడెడి ఓ మహాలక్ష్మీ! యెల్లప్పుడు నాకుప్రసన్నురాలవుకమ్మనియును నర్థమును తెలియచేసెడు "పద్మాసనే పద్మకరే" అనుశ్లోకముచేత నావాహనముచేసి యాశ్లోకము మొదలగు కల్పోక్తమంత్రములచేత పూజనునెరవేర్చిరి. ఇట్లు బూజించిన పిమ్మట కుడిహస్తమునందోరమునుగట్టుకొని నానావిధభక్ష్యభోజ్యాది పదార్థములను వరలక్ష్మీదేవికి నివేదనము చేసినవారైరి.

శ్లో॥ గంధాదిభిరలంకృత్య సుశీలం వృద్ధభూసురం। తస్మైదత్వావాయనంచ ద్వాదశాపూపసంయుతం। తతోదేవి సమీపేతు హావిష్యంచకుఃరంగనాః॥

తా॥ పిమ్మట వేదశాస్త్ర సంపన్నుడగు బ్రాహ్మణశ్రేష్ఠుని

గంధపుష్పాక్షతలచేత నతిభక్తితో బూజించి యా బ్రాహ్మణునికి బండ్రెండు కుడుములను, వాయనదానముచేసి యా వరలక్ష్మినియుంచి యున్న మంటపసమీపమున నివేదనముచేసి భక్ష్యభోజ్యముల నా స్త్రీలందరు భుజించిరి.

శ్లో॥ అథలక్ష్మీప్రసాదేన ముక్తామాణిక్యభూషితాః నూపురాః క్రాంతచరణా మణికాంచన భూషితాః॥ పుత్రపౌత్రైః పరివృతా ధన ధాన్య సమృద్ధిభిః। అన్నదానరతానిత్యం బంధుపోషణ తత్పరాః।స్వం పద్మసమాజగ్ముర్గృహాన్స్వైశ్వర్యధనసంకులం

తా॥ అంతట వరలక్ష్మీదేవి యనుగ్రహమువలన నా స్త్రీలందరును మహాభాగ్యసంపన్నులై నానావిధాభరణ భరితులై పుత్రపౌత్రాభివృద్ధి గలవారలై యెల్లప్పుడును బంధువులు మొదలయిన సమస్తజనులకు నన్నపానములు మొదలయిన యుపచారములచేత దృప్తిసేయుచు నానందభరితులై వరలక్ష్మీ ప్రసాదమువలన కలిగిన యేనుగులు గుఱ్ఱములు మొదలగు సమస్తసంపదలతో గూడుకొనిన వారయి వారివారి గృహములకుఁ బోయిరి.

శ్లో॥ అన్యోన్యం కథయామాసు శ్శ్రుతం చారుమతీముఖాత్ । ఇదంసత్యమిదంసత్యం నరోభద్రాణిపశ్యతి। వయం చారుమతీముఖ్యా ఉపలబ్ధమనోరథాః। పుణ్యాచారుమతీధన్యా భూయోభాగ్యవతీచిరమ్ । స్వయంయస్మైమహాలక్ష్మ్యై బోధితంహి వ్రతోత్తమం । ఇతిచారు మతీంసాధ్వీం తుష్టువుస్తత్రయోషితః । వరలక్ష్మి వ్రతంనామ తదాది భువివిశ్రుతమ్। ఏతత్తే సర్వమాఖ్యాతం వ్రతానాముత్తమవ్రతమ్॥

తా॥ పిమ్మట వారిలోవారు చెప్పుకొనినదేమనిన—చారుమతీ! దేవివలన వినబడిన ఈ వ్రతము సకలవ్రతములలోను సర్వోత్తమ మయినది. ఇదిసత్యము. దీనియందెంతమాత్రమును సందేహములేదు. మనుష్యులు దీనివలననే సమస్తక్షేమమును పొందగలరు. ఈ చారుమతి మొదలయిన మనమందరమును సమస్తములయిన కోరికలనుపొందితిమి. శ్రీమహాలక్ష్మి తనంతటనేవచ్చి స్వప్నములోనే చారుమతిదేవికి నిట్టియుత్తమవ్రతమును దెలియచెప్పి యనుగ్రహించినందున చారు.

మతీదేవి ధన్యురాలు చాలా పుణ్యవంతురాలని యీతీరున నామెను నానావిధములైన స్తోత్రములచేత బొగడుచున్నవారయిరి. అదిమొదలు లీవ్రతముభూమియందు సమస్తజనులచేతనాచరింపబడి ప్రసిద్ధికెక్కెను ఓపార్వతీ! ఈ వరలక్ష్మీవ్రతము సర్వోత్తమమయినది గాన నీవ్రతమును సవిస్తరముగ నీకు జెప్పినవాడనైతిని.

శ్లో॥ యఇదంశృణుయాద్వాపి శ్రావయేద్వాసమాహితః ।
సిద్ధ్యంతిసర్వకార్యాణి వరలక్ష్మీ ప్రసాదతః ॥

తా॥ ఈపుణ్యమగు వరలక్ష్మీవ్రతకథను విన్నవారును దామువిని యితరులకు చెప్పువారును వరలక్ష్మీదేవియొక్క యనుగ్రహము వలన సకలమయిన కార్యసిద్ధులను బొందుదురు.

ఇతి భవిష్యోత్తరపురాణే పార్వతీపరమేశ్వర సంవాదే
వరలక్ష్మీవ్రతకల్పం సపూర్ణమ్.

---

# మంత్రపుష్పం.

శ్లో॥ యశ్శుచిః ప్రయతోభూత్వా జుహుయాదాజ్యమన్వహం। శ్రియఃపంచదశర్చంచ శ్రీకామస్సతతంజపేత్ । ఆనందకర్దమశ్చైవ చిక్లీతఇతివిశ్రుతాః । ఋషయస్తేత్రియఃపుత్రా స్స్వయంశ్రీదేవిదేవతా ॥ పద్మాసనే పద్మఊరూ । పద్మాక్షీ పద్మసంభవే । త్వంమాం భజస్వపద్మాక్షీ యేనసౌఖ్యం లభామ్యహమ్ । అశ్వదాయీచ గోదాయీ ధనదాయీమహాధనే । ధనంమేజుషతాం దేవీం సర్వకామార్థసిద్ధయే ॥ పుత్రపౌత్ర ధనంధాన్యం హస్త్యశ్వాజావిగోరథం । ప్రజానాంభవసిమాతా ఆయుష్మంతం కరోతుమాం । చంద్రాభాంలక్ష్మీమీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీం । చంద్రసూర్యాగ్నిసర్వాభాం శ్రీమహాలక్ష్మీముపాస్మహే ॥ ధనమగ్నిర్ధనంవాయు ర్ధనం

సూర్యో ధనం వసుః । ధనమింద్రో బృహస్పతి ర్వరుణం ధనమశ్నుతే ॥
వైనతేయసోమం పిబసోమం పిబతు వృత్రహా । సోమం ధనస్య సోమినో
మహ్యం దదాతు సోమినః ॥ న క్రోధో న చ మాత్సర్యం న లోభో నా
శుభామతిః । భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా ॥
వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః । రోహంతు సర్వబీజాన్యవ
బ్రహ్మ ద్విషో జహి ॥ పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే
పద్మదళాయతాక్షి । విశ్వప్రియే విష్ణుమనోనుకూలే త్వత్పాదపద్మం
మయి సన్నిధత్స్వ ॥ యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయ
తాక్షీ । గంభీరావర్తనా స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా ॥
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుంభైర్ని
త్యం । సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగళ్యయుక్తా ॥
లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం । దాసీభూత
సమస్తదేవవనితాం లోకైకదీపాంకురాం ॥ శ్రీమన్మందకటాక్షలబ్ధ
విభవబ్రహ్మేంద్రగంగాధరాం। తాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం
వందే ముకుందప్రియాం ॥ సిద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సర
స్వతీ । శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా ॥ వరాంకుశౌ
పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థాం । బాలార్కకోటి
ప్రతిభాం త్రినేత్రాం భజేహమంబాం జగదీశ్వరీం తాం ॥ సర్వమంగళ
మాంగళ్యే శివే సర్వార్థసాధికే । శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి
నమోస్తు తే ॥

---

ఓం

పరబ్రహ్మణే నమః.

# కేదారేశ్వరవ్రతకల్పః.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం। ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే॥ శుభే శోభనేముహూర్తే శుభతిథౌ ప్రారప్స్యమాణస్య కర్మణః। నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే॥ ఇతిసంకల్ప్య॥ షోడశోపచారై రభ్యర్చ్య॥ ఆదౌ గణాధిపతిపూజాం కుర్యాత్॥ పునస్సంకల్ప్య॥ ఆచమ్య... శుభ నక్షత్ర శుభయోగ శుభకరణ్యాద్యనేకగుణవిశిష్టాయాం మస్యాం శుభ తిథౌ- అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య విజయాయురారో గ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ ఫలార్థ మిష్టకామ్యార్థ సిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య శుభఫలా వాప్త్యర్థం వర్షేవర్షేప్రయుక్త కేదారేశ్వర ముద్దిశ్య కేదారేశ్వర ప్రీ త్యర్థం భవిష్యోత్తరపురాణోక్తప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహ నాది షోడశోపచారపూజాం కరిష్యే॥ తదంగ కలశపూజాం కరిష్యే॥ కలశం గంధపుష్పాక్షతై రభ్యర్చ్య॥ కలశస్యోపరి హస్తం నిధాయ॥ శ్లో॥ కలశస్యముఖే రుద్రః కంఠే విష్ణుస్సమాశ్రితః। మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాస్స్మృతాః॥ కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపావసుంధరా। ఋగ్వేదోఽథయజుర్వేద స్సామవేదో హ్యథ ర్వణః। అంగైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః। ఆయాంతు శివపూజార్థం దురితక్షయకారకాః॥ శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి। నర్మదే సింధు కావేర్యో జలేఽస్మిన్ సన్నిధిం కురు॥ తతః నూతనవస్త్రద్వయేన మంటపారాధనం కుర్యాత్॥ మధ్యే కేదారకలశం నిధాయ॥ తత్ర తండులం పూరయిత్వా॥ నూ తనవస్త్రం సంవేష్ట్య॥ పంచపల్లవాని నారికేళంచ నిధాయ॥ ఇం ద్రాది లోకపాలకపూజాంచ కుర్యాత్॥ శివస్య దక్షిణేభాగే బ్రహ్మణే

నమః ॥ ఉత్తరభాగే విష్ణవేనమః । మధ్యే కేదారేశ్వరాయనమః ॥
నమస్కారంకృత్వా॥ తతః అఖండదీపారాధనం కుర్యాత్ ॥

తతః ప్రతిమాశోధనాదికం కుర్యాత్ ॥ తతః కేదారపూజాం
ప్రారంభేత్ ॥ శ్లో॥ శూలం డమరుకంచైవ దధానం హస్తయుగ్మకే ।
కేదారదేవమీశానం ధ్యాయేత్ త్రిపురఘాతినం॥ ధ్యానం॥ శ్లో॥ కైలాస
శిఖరే రమ్యే పార్వత్యాసహితప్రభో । ఆగచ్ఛ దేవదేవేశ మద్భక్త్యా
చంద్రశేఖర ॥ ఆవాహనం॥ సురాసురశిరోరత్న ప్రదీపితపదాంబుజ ।
కేదారదేవమద్దత్త మాసనంప్రతిగృహ్యతాం ॥ ఆసనంసమర్పయామి ॥
గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ । మౌక్తికాసనసంస్థాయ
కేదారాయ నమోనమః ॥ పాద్యం సమర్పయామి ॥ అర్ఘ్యంగృహాణ
భగవన్ భక్త్యాదత్తంమహేశ్వర । ప్రయచ్ఛమే మనస్తుష్టిం భక్తానా
మిష్టదాయక ॥ అర్ఘ్యంసమర్పయామి ॥ శ్లో॥ మునిభి ర్నారదప్రఖ్యై
ర్నిత్యమాఖ్యాతవైభవ । కేదారదేవ భగవన్ గృహాణాచమనంవిభో॥
ఆచమనం సమర్పయామి ॥ కేదారదేవభగవన్ సర్వలోకేశ్వరప్రభో ।
మధుపర్కంప్రదాస్యామి గృహాణత్వంశుభేనవై ॥ మధుపర్కంసమర్ప
యామి ॥ శ్లో॥ స్నానంపంచామృతందేవ శుద్ధశుద్ధోదకైరపి । గృహాణ
గౌరీరమణ త్వద్భక్తేన మయార్పితం ॥ పంచామృతస్నానం సమర్ప
యామి ॥ శ్లో॥ నదీజలసమాయుక్తం మయాదత్తమనుత్తమం। స్నానం
స్వీకురుదేవేశ సదాశివనమోస్తుతే ॥ శుద్ధోదకస్నానం సమర్పయామి॥
శ్లో॥ వస్త్రయుగ్మం సదాశుభ్రం మనోహర మిదంశుభం । దదామి
దేవ దేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతాం ॥ వస్త్ర యుగ్మం సమర్ప
యామి ॥ శ్లో॥ స్వర్ణ యజ్ఞోపవీతంచ కాంచనం చోత్తరీయకం ।
రుద్రాక్షమాలయా యుక్తం దదామి స్వీకురుప్రభో ॥ యజ్ఞోపవీతం
సమర్పయామి ॥ శ్లో॥ సమస్తగంధద్రవ్యాణాం దేవత్వమసిజన్మభూః ।
భక్త్యాసమర్పితం ప్రీత్యా మయాగంధాది గృహ్యతాం ॥ శ్రీగంధం
సమర్పయామి ॥ శ్లో॥ అక్షతోసి స్వభావేన భక్తానామక్షతం పదం ।
దదాసినాథమద్దత్తై రక్షతైః ప్రీయతాంభవాన్ ॥ అక్షతాన్ సమర్ప

యామి ॥ శ్లో॥ కల్పవృక్షప్రసూనైస్త్వాం పూజైర్వరభక్తార్చితస్సురైః ।
కుంకుమైఃపార్థివైరేభి రిదానీశ్చ్యర్చితాంమయా ॥ పుష్పాణిస...మి ॥

—: అ థాం గ పూ జా :—

మహేశ్వరాయనమః– పాదౌపూజయామి॥ ఈశ్వరాయనమః– జంఘేపూ...మి ॥ కామరూపాయనమః– జానునీ...మి ॥ హరాయ నమః–ఊరూ...మి॥ త్రిపురాంతకాయనమః– గుహ్యం...మి ॥ భవా యనమః– కటిం...మి ॥ గంగాధరాయనమః– నాభిం...మి ॥ మహా దేవాయనమః– ఉదరం...మి॥ పశుపతయేనమః– హృదయం...మి ॥ పినాకినేనమః– హస్తౌ...మి ॥ శివాయనమః– భుజౌ...మి ॥ శితికం ఠాయనమః– కంఠం...మి ॥ విరూపాక్షాయనమః– ముఖం...మి ॥ త్రినేత్రాయనమః– నేత్రే...మి॥ రుద్రాయనమః– లలాటం...మి॥ శర్వాయనమః– శిరః...మి ॥ చంద్రమౌళయేనమః– మౌళిం...మి ॥ పశుపతయేనమః– సర్వాణ్యంగానిపూజయామి ॥

—♦ అష్టోత్తర శతనామపూజా ♦—

(ప్రతినామమునకును చివర (నమః) అనునదియును, ఆదియందు (ఓం) అను ప్రణవాక్షరమును ఉచ్చరించవలయును.

ఓం శివాయనమః। మహేశ్వరాయ। శంభవే । శశిశేఖరాయ। పినాకినే। వామదేవాయ। విరూపాక్షాయ। కపర్దినే। నీలలోహితాయ। శంకరాయ। శూలపాణయే। ఖట్వాంగినే। విష్ణువల్లభాయ। శిపివిష్టాయ। అంబికానాథాయ। శ్రీకంఠాయ। భక్తవత్సలాయ। భవాయ॥శర్వాయ। త్రిలోకేశాయ । శితికంఠాయ। శివప్రియాయ। ఉగ్రాయ । కపాలినే । కామారయే। అంధకాసురసూదనాయ। గంగాధరాయ।లలాటాక్షాయ కాలకాలాయ। కృపానిధయే । భీమాయ । పరశుహస్తాయ । మృగపా ణయే। జటాధరాయ। కైలాసవాసినే । కవచినే । కఠోరాయ । త్రిపు రాంతకాయ। వృషాంకాయ । వృషభారూఢాయ। భస్మోద్ధూళితవిగ్ర హాయ। సామప్రియాయ । సర్వమయాయ । త్రయీమూర్తయేనమః । అనీశ్వరాయ। సర్వజ్ఞాయ। పరమాత్మనే।సోమసూర్యాగ్నిలోచనాయ।

హావిషేనమః । యజ్ఞమయాయ । సోమాయ। పంచవక్త్రాయ । సదాశివాయ। విశ్వేశ్వరాయ। వీరభద్రాయ। గణనాథాయ। ప్రజాపతయే। హిరణ్యరేతసే । దుర్ధర్షాయ । గిరీశాయ । అనఘాయ । భుజంగభూషణాయనమః । భర్గాయ। గిరిధన్వినే । గిరిప్రియాయ । కృత్తివాసనే । పురారాతయే। భగవతే। ప్రమథాధిపాయ। మృత్యుంజయాయ । సూక్ష్మతనవే। జగద్వ్యాపినే । జగద్గురవే । వ్యోమకేశాయ । మహాసేనజనకాయ । చారువిక్రమాయ। రుద్రాయ । భూతపతయే । స్థాణవే । అహిర్బుధ్న్యాయ । దిగంబరాయ । అష్టమూర్తయే । అనేకాత్మనే। సాత్త్వికాయ। శుద్ధవిగ్రహాయ। శాశ్వతాయ। ఖండపరశవే। అజాయ । పాశవిమోచకాయ। మృడాయ। పశుపతయే । దేవాయ । మహాదేవాయ। అవ్యయాయ। హరయే । పూషదంతభిదే । అవ్యగ్రాయ । దక్షాధ్వరహరాయ । హరాయ । భగనేత్రభిదే । అవ్యక్తాయ । సహస్రాక్షాయ। సహస్రపదే। అపవర్గప్రదాయ। అనంతాయ । తారకాయ । పరమేశ్వరాయ। శ్రీ కేదారేశ్వరస్వామినే నానావిధ పరిమళపుష్పాణి సమర్పయామి ॥ ఇత్యష్టోత్తర శతనామ పూజానంతరం గౌరీనామార్చనం కుర్యాత్ ॥

—* సూత్రగ్రంథి పూజా *—

శివాయనమః– ప్రథమగ్రంథిం పూజయామి ॥ శాంతాయనమః– ద్వితీయగ్రంథిం ...మి॥ మహాదేవాయనమః– తృతీయగ్రంథిం ...మి ॥ వృషభధ్వజాయనమః– చతుర్థగ్రంథిం...మి ॥ గౌరీశాయనమః– పంచమగ్రంథిం...మి॥ రుద్రాయనమః– షష్ఠమగ్రంథిం ...మి॥ పశుపతయేనమః– సప్తమగ్రంథిం ...మి ॥ భీమాయనమః– అష్టమగ్రంథిం ...మి॥ త్ర్యంబకాయనమః– నవమగ్రంథిం ...మి॥ నీలలోహితాయనమః– దశమగ్రంథిం ...మి॥ హరాయనమః– ఏకాదశగ్రంథిం ...మి॥ స్మరహరాయనమః– ద్వాదశగ్రంథిం ...మి ॥ భర్గాయనమః– త్రయోదశగ్రంథిం ...మి ॥ శంభవేనమః– చతుర్దశగ్రంథిం ...మి ॥ శర్వాయనమః– పంచదశగ్రంథిం ...మి ॥ సదాశివాయనమః– షోడశగ్రంథిం ...మి॥ ఈశ్వరాయనమః– సప్తదశగ్రంథిం ...మి ॥ ఉగ్రాయ

నమః- అష్టాదశగ్రంథిం... మి॥ శ్రీకంఠాయనమః- ఏకోనవింశతిగ్రంథిః... మి॥ నీలకంఠాయనమః- వింశతిగ్రంథిం... మి॥ మృత్యుంజయాయనమః- ఏకవింశతిగ్రంథిం... మి॥

శ్లో॥ దశాంగం ధూపముఖ్యంచ హ్యంగారకవినివేశితం । ధూపం సుగంధైరుత్పన్నం త్వాంప్రీణయతుశంకర ॥ ధూపంసమర్పయామి॥ శ్లో॥ యోగినాంహృదయాగార జ్ఞానదీపాంకురోద్భవ । బాహ్యదీపో మయాదత్తో గృహ్యతాంభక్తిగౌరవాత్ ॥ దీపంస... మి॥ శ్లో॥ త్రైలోక్యమపినైవేద్యం నతేతృప్తిస్తథాబహిః । నైవేద్యంభక్తవాత్సల్యాద్గృహ్యతాంత్ర్యంబకత్వయా ॥ నైవేద్యంస... మి॥ శ్లో॥ నిత్యానందస్వరూపస్త్వం యోగిహృత్కమలేస్థితం । గృహాణభక్త్యా మద్దత్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥ తాంబూలంస... మి॥ శ్లో॥ కర్పూరం చంద్రసంకాశం జ్యోతిస్సూర్యమివోదితం । భక్త్యాదాస్యామి కర్పూరం నీరాజనమిదంశివ ॥ నీరాజనం స... మి ॥ శ్లో॥ భూతేశభువనాధీశ సర్వదేవాదిపూజిత । ప్రదక్షిణంకరోమిత్వాం వ్రతమేసఫలంకురు ॥ ప్రదక్షిణంస... మి ॥ శ్లో॥ హరశంభోమహాదేవ విశ్వేశామరవల్లభ । శివశంకరసర్వాత్మన్ నీలకంఠనమోస్తుతే ॥ నమస్కారం స... మి ॥ శ్లో॥ అభీష్టసిద్ధింకురుమే శివావ్యయమహేశ్వర । భక్తానామిష్టదానార్థం మూర్తీకృతకళేబర ॥ ప్రార్థనా ॥ అర్ఘ్యంగృహాణ భగవన్ భక్త్యాదత్తం మహేశ్వర । ప్రయచ్ఛమే మనస్తుష్టిం భక్తానా మిష్టదాయక ॥ పునరర్ఘ్యంస... మి ॥ శ్లో॥ కేదార దేవదేవేశ భగవన్నంబికాపతే । ఏకవింశద్దినేతస్మిన్ సూత్రంగృహ్ణామ్యహంప్రభో॥ సూత్రగ్రహణం ॥ శ్లో॥ ఆయుశ్చ విద్యాంచ తథాసుఖంచ సౌభాగ్యవృద్ధిం కురు దేవ దేవ । సంసారఘోరాంబు నిధౌ నిమగ్నం మాం రక్ష కేదార నమో నమస్తే । తోరబంధనంకృత్వా ॥ శ్లో॥ కేదారః ప్రతిగృహ్ణాతు కేదారోవై దదాతిచ । కేదారస్తారకో స్మాకం కేదారాయ నమోనమః ॥ ఇతి వాయనదానం బ్రాహ్మణాయదద్యాత్ ॥ కేదార ప్రతిమాయస్మా దారిజ్య సౌభాగ్యవర్ధనీ । తస్మాదస్యాః ప్రదానేన మమాస్తు శ్రీరచంచలా॥ ఇతి ప్రతిమాదానమంత్రః॥ ఇతిపూజావిధిః ॥

— అ థ క థా ప్రా రం భః. —

సూతః॥ శ్లో॥ యస్యప్రసాదాద్భువనం క్రియతేసచరాచరం ।
తంప్రణమ్యమహాదేవం భగవంతముమాపతిం ॥

తా॥ ఎవనియొక్క యనుగ్రహమువలన జంగమస్థావరాత్మకమై ప్రపంచము సృజింపఁబడినదో అటువంటి షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, పార్వతీదేవి పెనిమిటియునగు ఈశ్వరునికి నమస్కరించి,

శ్లో॥ కేదారవ్రతమాహాత్మ్యం సర్వకల్యాణకారణం ।
ప్రవక్ష్యామి జగద్భూత్యై మునిభిశ్చపురాకృతం ।

తా॥ ప్రపంచమునం దాచరించెడువారలకు సంపద్వృద్ధికొరకు పూర్వమందు మునులచేఁ జెప్పఁబడినదై సమస్తశుభములకు హేతువైన కేదారవ్రత ప్రభావమును జెప్పుచున్నాను.

శ్లో॥ హృతంశంకరదేహార్థం దేవ్యాయద్వ్రతచర్యయా ।
యద్వ్రతంచరతాంలోకే సంభవంతివిభూతయః ॥

తా॥ ఏవ్రతము నాచరించుటచే పార్వతీదేవి సాంబమూర్తిశరీరములో సగభాగమునుఁబొందినదో మఱియు సమస్తజనులు నేవ్రతము నాచరించుటచే సర్వసంపత్తులను బొందుచున్నారో,

శ్లో॥ ఆరోగ్యమాయుఃకీర్తిశ్చ వర్ధంతేశృణ్వతామిదం ॥
ఏకవింశతివారాన్య శ్చరత్యేతద్వ్రతోత్తమం ॥

తా॥ ఇరువదియొక్కపర్యాయ మెవరీవ్రతము నాచరింపుచున్నారో అట్టివారలకును, ఈవ్రతకథను వినువారలకును ఆరోగ్యము, ఆయుస్సు, కీర్తియు వృద్ధియగుచున్నవి.

శ్లో॥ ఇహాముత్రచకల్యాణం వదంతిధ్రువముత్తమం ।
వ్రతంసమాచరన్మర్త్య స్సౌభాగ్యంకాంతిమేవచ ॥

తా॥ ఈ వ్రతమునుజేయు మనుష్యుఁడు కాంతిని, సౌభాగ్యమును, అధికమైన శ్రేయస్సును ఇహలోక పరలోకములయందు నిశ్చయముగా బొందగలడని ఈశ్వరుఁడు చెప్పియున్నాఁడు.

శ్లో॥ ఆయుశ్శ్రియంచలభతే శివలోకే మహీయతే। తస్మాద్ద్విజోవా రాజోవా వైశ్యోశూద్రఏవవా। యేచాప్యన్యేవరాః కుర్యుస్సరియతా వ్రతముత్తమమ్॥

తా॥ అధికప్రభావము గలదగుటవలన బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుఁడైనను లేకయితరులైన యేమనుష్యులైనను స్థిరచిత్తులై యీవ్రతమునాచరించిరేని వారలు దీర్ఘాయుస్సును సంపత్తునుబొంది యనంతరమున శివలోకమునందు నివసించెదరు.

శ్లో॥ అస్తిపూర్వోత్తరేభాగే పృథివ్యాంధరణీధరః।
కైలాసఇతివిఖ్యాత శ్శ్రీమాన్లోకనమస్కృతః॥

తా॥ భూమియందీశాన్యదిక్కున శోభాయుక్తమైనటువంటియును సర్వజనులు నమస్కరింప దగినటువంటియును కైలాసమనెడు పేరుగల పర్వతశ్రేష్ఠముగలదు.

శ్లో॥ రాజితైర్విమలైశ్శృంగై స్స్వర్ణరత్న విచిత్రితైః।
తటిద్గణసమాకీర్ణై శ్శారదాభ్రై రివస్థితైః॥

తా॥ (ఆ పర్వతము) మెఱుపుదీగెలతోఁ గూడుకొనిన శరత్కాల మేఘములవలె నిర్మలముగాను సకలరత్నములచేఁ జిత్రముగానున్న శిఖరములతోఁ గూడుకొనియుండెను.

శ్లో॥ నానాద్రుమలతాకీర్ణై ర్నానాపుష్పఫలైర్యుతైః నానావిహగసంఘుష్టై ర్నానానిర్ఝరసంకులైః। సాలైస్తమాలైస్తిలకైర్హింతాలైర్వకుళైరపి। అశోకైఃకరకైర్నింబైశ్చందనైర్దేవదారుభిః॥ నారికేళామ్రపనస పూగపున్నాగచంపకైః । ఏతైశ్చాన్యైశ్చతరుభి శ్శోభితం పుణ్యకాననమ్॥

తా॥ మఱియు నాపర్వతమందుండు వనము విశేషమైన తీగెలతోడను అనేకమైన పుష్పఫలాదులతోడను ననేకమైన పక్షిసమూహములతోడను విస్తారమైన నదీప్రవాహములతోడను సాలతమాలతిలక హింతాళ వకుళాశోక కరక నింబ చందన దేవదారు మొదల

యిన సుగంధవృక్షములతోడను నారికేళామ్ర పూగపున్నాగ పనస చంపకాదిఫలవృక్షప్రధానమైన వృక్షములతోడను మఱియునితరమైన చిత్ర విచిత్ర వృక్షములతోడను ప్రకాశించుచుండెను.

శ్లో॥ ఏతస్యశిఖరే రమ్యే యోగిబృందనిషేవితే। యక్షకిన్నర గంధర్వ సిద్ధవిద్యాధరైర్వృతే। సమావసతి విశ్వాత్మా పినాకీప్రమథైర్వృతః ।అంబికాసహితశ్శ్రీమాన్ సర్వదేవనమస్కృతః

తా॥ సుందరమగునట్టియు- మునిసమూహముచే సేవింపఁబడు చున్నట్టియు యక్షులు, కిన్నరులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులతో నిండియున్నట్టియుఁ బూర్వోక్తమయిన కైలాసశిఖరపర్వతమందు ప్రకాశమానుఁడై ప్రపంచస్వరూపుఁడయిన సాంబమూర్తి ప్రమథగణములతోను పార్వతితోను గూడినవాడయి సర్వదేవతలచే నమస్కరింపబడుచు నివసించుచుండెను.

శ్లో॥ ఏకదాతస్యశిఖరే రుద్రాణీసహితశ్శివః।
తథాప్రకుర్వన్ వసతిం సురాణాం దర్శనందదౌ॥

తా॥ ఆ కైలాసపర్వతశిఖరమందు సాంబమూర్తి పార్వతితోగూడ నివాసముఁజేయుచు ఒకానొకప్పుడు దేవతలకు దర్శనమిచ్చెను.

శ్లో॥ అగ్నిర్వాయుస్తథాదిత్య శ్చంద్రమాస్సహతారకః।
బ్రహ్మాదయోవసిష్ఠాద్యా స్తేసర్వేతంసిషేవిరే॥

తా॥ అగ్నిహోత్రుఁడు, వాయువు, సూర్యుఁడు, చంద్రుడుఁడు, అశ్వని మొదలుగాగల నక్షత్రములు, బ్రహ్మమొదలయిన దేవతలు, వసిష్ఠుడుమొదలైనమునీశ్వరులు ఆపరమేశ్వరుని సేవించుచుండిరి.

శ్లో॥ రంభాతిలోత్తమాచైవ సహజన్యాచమేనకా। యాశ్చాన్యాదేవవనితాః। పరితస్తుపినాకినం। మాతరశ్చండికాద్యాశ్చ కార్తికేయో గజాననః। నంద్యాదయో దేవగణా స్సారూప్యసహితాస్థితాః

తా॥ రంభ, తిలోత్తమ, అయోనిసంభవులైన మేనక, మఱియు నితరులయిన దేవతాస్త్రీలును, చండిక మొదలయిన దశమాతృకలును, కుమారస్వామి, విఘ్నేశ్వరుడు, ఈశ్వరునియొక్క

రూపమును ధరించి సంతోషింపఁజేయు నంది మొదలయిన ప్రమథ గణములును ఆసాంబమూర్తిని నలుప్రక్కల నావరించి సేవించు చుండిరి.

శ్లో॥ ఏవంప్రవర్తమానాయాం సభాయాంరుద్రసన్నిధౌ ।
నారదప్రముఖా స్తత్ర జగుస్తేనప్రచోదితాః ॥

తా॥ ఈశ్వరుని సన్నిధానమందు సర్వదేవతలచే ప్రకాశించు సభయందు నారదుఁడు మొదలయిన గాయకులు ఆసాంబమూర్తిచేఁ బ్రోత్సాహముఁ జేయఁబడినవారై మనోహరముగా గానము చేసిరి.

శ్లో॥ తేషాంప్రవృత్తేమధురే గీతేసర్వమనోహరే ।
వాదిత్రలయసంయుక్తా ననృతుశ్చాప్సరోగణాః ॥

తా॥ సర్వజనులకు మనోహరమైన గానమును మునీశ్వరులు పాడినపిమ్మట దేవవేశ్యలు మద్దెల తాళము మొదలయినవాని ననుస రించి నాట్యముజేసిరి.

శ్లో॥ తాసామప్సరసాంమధ్యే రంభా సర్వాంగసుందరీ ।
మధురంలాస్యమకరో త్సర్వగీర్వాణసమ్మతమ్ ॥

తా॥ ఆయప్సరసలలో సర్వావయవములయందు సౌందర్యము గల రంభ సర్వదేవతలు ఆనందింపఁదగిన మనోహరమయిన నృత్య ము జేసెను.

శ్లో॥ తత్రభృంగిరిటిర్నామ సమయేశివసమ్మతం ।
అద్భుతంవికటంనృత్త మకరోద్ధరసన్నిధౌ ॥

తా॥ అచ్చట భృంగిరిటియను సేవకుఁ డీశ్వరసన్నిధానమున నాశ్చర్యకరమైన నవ్వునుబుట్టించు నృత్యమును సాంబమూర్తి కింపు గలుగునట్లుగా జేసెను.

శ్లో॥ తత్రప్రవర్తతేహాస స్సురాణాం శివయోఃపురః ।
మహాన్కలకలశ్చాసీ ద్గిరికందరపూరణః ॥

తా॥ దేవతలయొక్కయు- పార్వతీ పరమేశ్వరులయొక్కయు ముందఱను భృంగిరిటిచేజేయఁబడిన వికట నృత్యముచే గొప్ప నవ్వు

పుట్టెను. ఆనవ్వు ఆపర్వతగుహలలో వ్యాపించి కలకలధ్వనిని గలుగ జేసెను.

శ్లో॥ ఏవం ప్రహసనాం తేతు శ్రీమాన్ సర్వేశ్వరోఽబ్రవీత్ ॥

తా॥ భృంగిరిటిచే నవ్వుపుట్టింపఁబడిన తర్వాత శోభాయుక్తుఁడై సర్వప్రపంచమునకు నీశ్వరుఁడయిన శివుఁ డిట్లుపలికెను.

శ్లో॥ సాధుభృంగిరిటేసమ్య కృతంప్రహసనంత్వయా ।
ఇత్యుక్త్వాభగవాన్ తస్మై ప్రసాదమకరోద్విభుః ॥

తా॥ ఓ భృంగిరిటీ! నీ వందఱకు నవ్వువచ్చురీతిని మంచి నాట్యముజేసితివి. అని శివుఁడుపలికి వానియందనుగ్రహముచూపెను.

శ్లో॥ హరప్రసాదా త్సుప్రీత సురైశ్చ సుబహూకృతః । హరం ప్రదక్షిణీకుర్వన్ వినాదేవీంసమాహితః । ప్రణామ మకరో త్తస్మై వినయేన సమన్వితః ॥

తా॥ ఈశ్వరుని యనుగ్రహమువలనను, దేవతలుచేసిన సత్కారమువలనను సంతోషించినవాఁడై భృంగిరిటి పార్వతిని విడిచిపెట్టి సాంబమూర్తికిమాత్రము వినయముతోను, స్థిరచిత్తముతోను ప్రదక్షిణమొనరించి నమస్కారముజేసెను.

శ్లో॥ తతోదే వ్యబ్రవీ ద్వాక్యం దేవముద్వీక్ష్య సుస్మితా । మద్భాగంపరిహృత్యాఽసౌ కృతవాన్త్వత్ప్రదక్షిణం । ప్రణామస్య కిమేతస్య కారణంపరమేశ్వరః । బ్రూహిమేతత్వతస్సర్వం శ్రోతుం కౌతూహలంహిమే ॥

తా॥ అనంతరమునఁ బార్వతీదేవి చిరునవ్వుతోఁ గూడినదై సాంబమూర్తిని జూచి ఓస్వామీ! నన్ను విడిచి భృంగిరిటి మీకు మాత్రము ప్రదక్షిణము చేసెను. దీని కారణమంతయును యదార్థముగా చెప్పవలయును. వినుటకు మిక్కిలి వేడుకతోనుంటిని.

శ్లో॥ తద్దైవముక్తోభగవాన్ బభాషేశశిశేఖరః ॥

తా॥ ఈప్రకారము పార్వతి యడుగఁగా షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన సాంబమూర్తి యుత్తరమునుజెప్పెను.

శ్లో॥ యోగినోనసమంతిత్వాం పరమార్థవిదఃప్రియే ।
యేభజంతిప్రియేత్వాంతు తేషాంనాస్తిప్రయోజనమ్ ॥

తా॥ ఓప్రియురాలా ! యదార్థమును దెలిసికొనిన యోగీశ్వరులు నీకు నమస్కరింపరు. నిన్ను సేవించినవారికి నీవలన ప్రయోజనములేదు.

శ్లో॥ ఇత్యుక్త్వాసామహేశేన తత్యాజప్రియమీశ్వరీ ।
శక్త్యావినాకృతసోథ త్వగస్థివిషమాంగభృత్ ॥

తా॥ ఇట్లుచెప్పిన పెనిమిటివాక్యమును విని కోపించి యామె సాంబమూర్తిని విడిచిపెట్టెను. ఆఈశ్వరుఁ డంతట శక్తిలేనివాఁడై చర్మమును, ఎముకలనుమాత్రము కలిగి నిస్సారమైన దేహమును ధరించినవాఁడై యుండెను.

శ్లో॥ అంబాత్వగస్థిశేషాసా నిస్సారావికటాభవత్ ।
తతస్తుదేవీకుపితా దేవతాభిఃప్రసాదితా ॥

తా॥ పార్వతీదేవియు సాంబమూర్తిని విడిచిపెట్టుటచే బలము లేనిదై చర్మమును మెముకలునుమాత్రము కలదై దేవత లెంతబ్రతిమాలినను వినక కోపముజెందియుండెను.

శ్లో॥ జగామముక్త్వాకైలాసం తపసేగౌతమాశ్రమం । సింహైర్నాగైశ్చ శార్దూలై ర్వారిస్థైశ్చ విషేవితం । పన్నగై గ్గరుడైశ్చాపి విముక్తానోన్యమత్సరైః। నానాద్రుమలతాకీర్ణం సేవితంపరమర్షిభిః। సర్వలోకప్రియకరం సర్వకామఫలప్రదమ్ ॥

తా॥ పరస్పరము ద్వేషమువదలివిహారించుచున్న సింహములతోను, గజములతోను. పెద్దపులులతోను. లేళ్ళతోను, పాములతోను, గరుడపక్షులతోను నిండియున్నటువంటియు, అనేకమైన వృక్షములచేతను, తీగెలచేతను నావరింపబడినటువంటియు, మునీశ్వరులకు వాసస్థానమైనదియు, సర్వజనులకు నానందకరమై సకల కోరికలను సఫలముగాజేయునట్టిదయిన గౌతమమునీశ్వరునియొక్క ఆశ్రమమునకుఁ దపస్సుచేయుటకై పార్వతీదేవి వెళ్లెను.

శ్లో॥ గౌతమోపి మహాతేజా స్సమిత్కుశఫలానిచ । వన్యాని హోమయోగ్యాని వనాదాహృత్యనిర్గతః । మునిస్తుస్వాశ్రమాభ్యాసే శోభాముద్వీక్ష్య విస్మితః । కిమిదం తాపసారణ్య మిదానీం శోభతే భృశం । ఇతిచింతాసమావిష్టో వివేశస్వాశ్రమంమునిః ॥

తా॥ అనంతరము విశేషముగా బ్రకాశించుచున్న గౌతమ మునీశ్వరుఁడు హోమమునకుఁదగిన సమిధలను, దర్భలను, ఫలము లను, తండులములను సంపాదించి తన యాశ్రమమునకుఁ దిరిగి వచ్చుచుఁ దన యాశ్రమసమీపమందున్న శోభనుజూచి యాశ్చర్య మునుబొంది యేమి హేతువో యీయరణ్య మింత శోభతోఁ గూడి యున్నదని మనస్సున నాలోచింపుచుఁ దన యాశ్రమమును బ్రవే శించెను.

శ్లో॥ ప్రవిశ్యపద్మపత్రాక్షీం భవానీంవీక్ష్యభూషితాం ।
సోఽపృచ్ఛదభిపూజ్యైనాం తత్రాగమనకారణమ్ ॥

తా॥ ఆ గౌతమమహాముని తామరరేకులవంటి నేత్రములు గలదియు, అలంకారములను ధరించినదియు నైన యాపార్వతీదేవినిఁ జూచి యామెను పూజించి ఓ చిన్నదానా! నీ విచ్చటకు వచ్చుటకుఁ గారణమేమని యడిగెను.

శ్లో॥ పృష్టాసామునినాదేవి స్వవిషాదస్యకారణం ।
ఉక్త్వాచసుఖమాసీనం ప్రణమ్యపునరబ్రవీత్ ॥

తా॥ మునీశ్వరుఁడట్లడుగఁగా పార్వతీదేవి తన దుఃఖకారణ మునుజెప్పి, శ్రీమదీశ్వరుని సుఖముగా గూర్చుండిన మునీశ్వరునకు నమస్కారముజేసి తిరిగి చెప్పుచున్నది.

శ్లో॥ భగవన్ హరదేహార్థం యాదృశేనాఽప్య తేమయా ।
తాదృశంమేవ్రతంబ్రూహి యద్భవేద్యోగినమ్మతమ్ ॥

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవైన ఓ మునీశ్వరుఁడా! ఏవ్రత మునుజేయఁగా ఈశ్వరుని శరీరములో సగభాగమును బొందఁగలనో యేవ్రతము యోగులకు నిష్టమయినదో యట్టి వ్రతమును జెప్పుమని పార్వతి మునీశ్వరుని అడిగెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాథ మహాతేజా భవాన్యా వాక్యమీరితం । సమీక్ష్యసర్వశాస్త్రాణి పురాణానిచసర్వశః । అభీష్టవరదంచైవ శ్రీమత్కేదారనామకం । ఆచచక్షేమునివరో భవాన్యైసువ్రతంమహాత్ ॥

తా॥ అనంతరము గౌతమమహాముని పార్వతి చెప్పిన వాక్యమును విని సకల శాస్త్రములను, పురాణములను బరిశీలనచేసి కోరిన వరమునిచ్చునట్టి కేదారమనెడు పేరుగల మంచివ్రతమును పార్వతీదేవికిఁ జెప్పెను.

శ్లో॥ అపర్ణాచాబ్రవీద్వాక్యం వ్రతస్యాస్యవిధిక్రమః ।
కథంకథయతం దేవ యథాశాస్త్రప్రచోదితమ్ ॥

తా॥ ఓస్వామీ! ఈవ్రతము నేరీతిగా జేయవలయునో శాస్త్రములో జెప్పినట్లు దానినంతయు జెప్పుమని పార్వతీదేవి యడిగెను.

శ్లో॥ ఏవంబ్రువాణాంతాం దేవి మువాచమునిపుంగవః ॥

తా॥ ఈరీతిఁ బార్వతి ప్రశ్నచేయఁగా గౌతమముని జెప్పుచున్నాఁడు.

శ్లో॥ మాసి భాద్రపదే ఽష్టమ్యాం శుక్లపక్షే సమాహితః । క్షౌమైఃకార్పాసకైర్వాపి యథారుచిసుశోభనైః । హస్తేబధ్వా ప్రతిసరం హ్యేకవింశతితంతుభిః । ఉపోష్యరజనీంతాంతు కృత్వా బ్రాహ్మణభోజనం । తదారభ్యప్రకర్తవ్య మమావాస్యావధివ్రతమ్ ॥

తా॥ భాద్రపదశుద్ధాష్టమిదినమున స్వస్థచిత్తుఁడై పట్టువిగాని, నూలువిగాని ప్రకాశించుచున్న యిరువదియొక్కపోగులు తనయిష్టం చొప్పునఁ జేర్చి యాతోరమును చేతికిఁ గట్టుకొని ఆరాత్రి ఉపవాసముండి బ్రాహ్మణులను భుజింపఁజేసి అదిమొద లమావాస్యవఱకట్లు చేయుచుండవలెను.

శ్లో॥ నిత్యంప్రాతస్సముత్థాయ కృత్వాపూజాంప్రయత్నతః ।
కేదారదేవపూజాంతు కుర్యాదపివిశేషతః ॥

తా॥ ప్రతిదినము ఉదయమునలేచి శుద్ధుఁడై భక్తిశ్రద్ధలతో విశేషముగా కేదారదేవునిఁ బూజచేయవలయును.

శ్లో॥ వివిక్తేసుచిదేశేను ధాన్యరాశింనిధాయచ। తస్యోఽపరినిధాయాథ పూర్ణకుంభంసుశోభనం। సంవేష్ట్యసుత్రిజాలైశ్చ హ్యేకవింశతిసంఖ్యకైః। క్షౌమేనవాపుకూలేన కార్పాసేనాపివేష్టయేత్ ॥

తా॥ ఏమియులేని శుద్ధప్రిదేశమందు ధాన్యమును రాశిగానుంచి దానిపై యోగ్యమైన పూర్ణకలశమునుంచి యా కలశమును యిరువదియొక్క పోగులచేఁ గల్పింపఁబడిన తోరముగోఁజుట్టి పట్టువస్త్రమునయిన నూలువస్త్రమునయిన జుట్టవలెను.

శ్లో॥ నవరత్నానివాతస్మిన్ సువర్ణంవాతథాపలం।
నిధాయగంధపుష్పాద్యై రర్చయిత్వాయథావిధి ॥

తా॥ నవరత్నములనయినను, పలమెత్తుగల బంగారమునయినను నాకలశమందుంచి గంధ పుష్పాదులచే యథాశాస్త్రీయముగాఁ బూజింపవలెను.

శ్లో॥ త్రిసప్తసంఖ్యకాన్ దేవి బ్రాహ్మణాన్ వేదపారగాన్। సమాహూయప్రితిష్ఠాప్య పాదశౌచంవిధాయచ। పూజయేదథ తాన్ సర్వ న్పురోహితపురస్సరాన్। తతః కేదారదేవస్య కుర్యాదావాహనంపునః ॥

తా॥ సాంగముగా వేదముజదివిన యిరువదియొక్క బ్రాహ్మణులనుబిలిచి కూర్చుండఁబెట్టి పాదప్రిక్షాళనముజేసి పూజించి యనంతరమునఁ బురోహితుఁడు మొదలయిన సర్వబ్రాహ్మణులనుబూజించిపిమ్మట కేదారేశ్వరుని తిరిగి ఆవాహనము చేయవలెను.

శ్లో॥ ఆవాహ్యదేవ్యంతత్రైవ ప్రితిష్ఠాప్యయథావిధి। చందనాగరు కర్పూర కస్తూరీ కుంకుమాదికాన్। గంధాంశ్చ వివిధాన్దేవి పుష్పాణివివిధానిచ। తాంబూలవిచిత్రాణీ వాసాంసిచనివేదయేత్ ॥

తా॥ ఓ పార్వతీ! పైనఁ జెప్పినరీతి కేదారేశ్వరుని అచ్చట నావాహనముచేసి శాస్త్రమునకనుసరించి ప్రితిష్ఠాపనచేసి మంచిగంధ కర్పూరము, కస్తూరి, కుంకుమ, మొదలయినసుగంధ

ద్రవ్యములను- అనేకవిధములయిన పుష్పములను- తాంబూలములను అనేకరంగులుగల వస్త్రములను స్వామికి సమర్పింపవలయును.

శ్లో॥ పుష్పైరభ్యర్చ్యవిధివ ద్ధూపదీపాదిభిశ్శివమ్ । గోధూమ పిష్టసంక్లుప్తానేక వింశతిసంఖ్యకాః ॥ అపూపాన్ఘృతపక్వాంశ్చ పాయసం గుడసంయుతం । దధ్యాజ్య మధుసంయుక్త మన్నైకైర్వ్యంజనైర్యుతమ్ ॥ ఫలైరనేకై స్సంపూర్ణం కదలీపనసామ్రకైః । పక్వాన్నివేద్య దేవాయ కృత్వాదాచమనీయకమ్ ॥

తా॥ కేదారేశ్వరునిఁ బుష్పములచేతఁ బూజించి ధూపదీపములనర్పించి గోధుమపిండితోఁ జేయఁబడిన యిరువదియొక్క-బూరెలను- బెల్లము వేయఁబడిన పరమాన్నముతోను- పెరుగుతోను- నెయ్యితోను- తేనెతోను - అనేకమయిన కూరలతోను గూడిన షడ్రసోపేతమయిన యన్నమును అఁటి పనస మామిడి మొదలయిన సకలఫలములను సంపూర్ణమగునట్లుగా సమస్తపదార్థములను దేవునికి నివేదనముచేసి యాచమనజలమునుంచవలెను

శ్లో॥ తాంబూలంచ నివేద్యాథ స్తోత్రం కుర్యాద్యథేప్సితమ్ । కృత్వాదేవస్య పూజాంచ దేవి కేదారనాయకమ్ ॥ యథాశక్తిసువర్ణాది బ్రాహ్మణేభ్యః ప్రదాయచ । వ్రతంసమాప్యవిధివ త్ప్రీణయస్వ త్రిలోచనమ్ ॥

తా॥ ఓపార్వతీ ! తాంబూలమునిచ్చి యనంతరము నీకిష్టము చొప్పన కేదారేశ్వరుని స్తోత్రముచేసి పూజను సమాప్తినొందించి శక్తికొలఁది బంగారు మొదలయిన ధనమును బ్రాహ్మణులకిచ్చి యథాశాస్త్రీయముగా వ్రతమును సమాప్తి నొందించి సాంబమూర్తిని సంతోషపెట్టుము,

శ్లో॥ తతః ప్రీతో మహాదేవ స్సర్వదేవగణైస్సహ ।
ఆగత్యస్వశరీరార్థం భవత్యైదాస్యతిస్వయమ్ ॥

తా॥ అనంతరము శివుఁడు తాను సమస్తమయిన దేవసమూహములతోఁగూడివచ్చి తనశరీరములో సగము నీకునియ్యఁగలఁడు.

శ్లో॥ ఏతద్భవానీసాప్రీతా శ్రుత్వా గౌతమభాషితమ్ ।
యథానిర్దిష్టమృషిణా తథాసర్వం సమాచరేత్ ॥

తా॥ ఇట్లు గౌతమమహాముని చెప్పినవాక్యమును పార్వతివిని సంతోషముగలదై యేరీతిగా మునీశ్వరుఁడు చెప్పెనో యాప్రకారమంతయుఁ జేసెను.

శ్లో॥ తతః ప్రీతమనాభూత్వా భగవాన్వృషభధ్వజః ।
గత్వా దేవగణైస్సార్థం స్వదేహార్థందదౌహరిః॥

తా॥ అనంతరము షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన సాంబమూర్తి సంతోషించిన మనస్సుగలవాఁడై దేవతా సమూహములతోఁగూడి పార్వతియొద్దకు వెళ్ళి తన శరీరములో సగభాగమిచ్చెను.

శ్లో॥ తతోభవానీసుప్రీతా శంకరార్థంసమేత్యచ ।
దేవంప్రసాదయామాస లోకానాం హితకామ్యయా ॥

తా॥ అనంతరము పార్వతీదేవి సాంబమూర్తి శరీరములో సగభాగమునుబొందిసంతోషించి ఈవ్రతమును భూలోకమందు వ్యాపింపఁ జేయవలెనని పెనిమిటిని ప్రార్థించెను.

శ్లో॥ దేవప్రసాదాత్త్రైలోకే చరంతేత్రద్వ్రతంజనాః ।
యోయత్ప్రార్థయతెబుద్ధ్యా తత్సర్వంసమవాప్నుయాత్ ॥

తా॥ ఓస్వామీ ! మీ యనుగ్రహమువలన యీవ్రతము భూలోకములో జనులు చేయునట్లుగాను, ఏమనుష్యుఁడు తన మనస్సున దేనినిగోరునో దానిని బొందునట్లుగాను వరము దయచేయుమనెను.

శ్లో॥ ఇతిప్రసాదితోదేవ్యా భగవానంబికాసఖః ।
తథేఽత్యుక్త్వాసురగణైస్తత్రైవాంతరధీయత ॥

తా॥ ఈప్రకారము పార్వతి వేడుకొనఁగా పార్వతీప్రియుండైన శివుఁడాలాగుననే వ్యాపించుననిపలికి దేవసమూహములతోఁగూడ నచ్చట నదృశ్యమాయెను.

శ్లో॥ తతశ్చిత్రాంగదోనామ గంధర్వశ్శివభక్తిమాన్ ।
వ్రతచర్యాక్రమంలేభే నందికేశ్వర పార్శ్వతః ॥

తా॥ అనంతరమున శివభక్తిగల చిత్రాంగదుఁడనెడు గంధర్వుఁడు సాంబమూర్తికి సేవకుండయిన నందికేశ్వరునివలన నీ కేదారేశ్వర వ్రతనిధిని దెలిసికొనెను.

శ్లో॥ మనుష్యవిషయంప్రాప్య వ్రతమేతద్విశామ్యహం ।
ఏవంసతువినిశ్చిత్య జగామోజ్జయినీంపురీం ।

తా॥ ఆచిత్రాంగదుఁడు భూలోకమునకు వెళ్ళి యచ్చటనీవ్రతమును వ్యాపింపఁజేయువలయునని నిశ్చయించుకొని ఉజ్జయిని యనెడు పట్టణమునకు వెళ్ళెను.

శ్లో॥ వజ్రదంతాయవిధివద్దదౌరాజ్ఞేవ్రతంసుధీః ।
వ్రతస్యాస్యప్రభావాత్తు సమహానభవత్ప్రభుః ॥

తా॥ బుద్ధిశాలియైన చిత్రాంగదుఁడు ఉజ్జయినీ పట్టణమునకు రాజైన వజ్రదంతునకు కేదారేశ్వర వ్రతవిధి నంతయు బోధించెను. పిమ్మట నారాజు కేదారేశ్వరవ్రతమును జేసి దానిప్రభావముచే గొప్ప ప్రభువాయెను.

శ్లో॥ అథాఽభూతాంవైశ్యసుతే తస్యాంచపురికన్యకే ।
ఏకాంపుణ్యవతీంప్రాహూ రన్యాంభాగ్యవతీంవిదుః ॥

తా॥ అనంతరమందా నగరమందొక కోమటికి పుణ్యవతియనియు, భాగ్యవతియనియు నిద్దరు కుమారికలు గలరు.

శ్లో॥ తేకన్యేపితరంప్రాప్య బభాషాతేప్రియంవచః ।
మహత్కేదారదేవస్య వ్రతంకర్తుంప్రసీదమే॥

తా॥ ఆ కోమటికన్యలు తండ్రివద్దకువెళ్ళి కేదారదేవుని సంబంధమైన గొప్ప వ్రతమును మాయందనుగ్రహము కలవాఁడవై మాచేజేయింపుమని తండ్రితోననిరి.

శ్లో॥ తాభ్యామేవంనిగదితే పితావైవాక్యమబ్రవీత్ ।
వత్సేబ్రూతందరిద్రోఽహం కథమాసాద్య తేమయా ॥

తా॥ ఈప్రకారము కుమారికలు పలుకఁగా విని తండ్రి, ఓయీ పుత్రికలారా! నేను దరిద్రుఁడను. నేనేప్రకారమావ్రతము నెరవేర్చగలనని యనెను.

శ్లో॥ సామగ్రీచాస్యనాస్త్యేవ యువాభ్యాంతద్విముచ్యతాం ।
ఇతిపిత్రాసమాదిష్టే కన్యేప్రసరవోచతాం ॥

తా॥ ఈవ్రతమునకుఁ దగినపదార్థము నావద్ద లేదు. కాన మీ కోరికనువిడువుఁడని తండ్రిపలుకఁగా కుమారికలు తిరిగిచెప్పచున్నారు.

శ్లో॥ అనుజ్ఞాతేత్వయాతాత కర్తుమిచ్ఛావసువ్రతం ।
త్వదనుజ్ఞైవనియత మావయోః పరమంధనం ॥

తా॥ ఓతండ్రీ! మీరనుజ్ఞ నిచ్చినచో మేముచేయుటకుద్యుక్తులమైయున్నాము. మీ యనుజ్ఞయే మాకు స్థిరమయిన గొప్ప ధనము.

శ్లో॥ ఇత్యుక్త్వాతేనవైశ్యేన కృతాజ్ఞేనాథకన్యకే । కస్మింశ్చిద్రుచిరేదేశే వటవృక్షసమాశ్రితే । బద్ధ్వాప్రతిసరంతత్ర చక్రాతే ఉర్చాం యథావిధి । ఏతయోర్భక్తిశీలేన తత్సామగ్రీం దదౌహరః ॥

తా॥ అపిల్లలటులుపల్కి తండ్రిని సమాధానపఱచి యనుజ్ఞఁ దీసికొని యొకానొక రమ్యమయిన మఱ్ఱిచెట్టుకద్దకు వెళ్ళి యచ్చట శుచిప్రదేశమందుఁ గూర్చుండి తోరమును చేతియందుధరించి యథావిధిగా పూజచేయఁగా కేదారేశ్వరుఁడు వారిభక్తికి మెచ్చి యావ్రతమునకుఁ గావలసిన పదార్థములన్నియు సమకూర్చెను.

శ్లో॥ వ్రతచర్యాంసమాసాద్య ప్రీతేవై చక్రతుర్వ్రతం ।
తతఃప్రీతోమహాదేవ స్సాంబసన్నిహితోఽభవత్ ॥

తా॥ భగవంతుఁడు కావలసిన పదార్థములనీయఁగా నా కన్యకలు సంతోషముగలవారై వ్రతమును నమాప్తినిబొందించిరి. అనంతరము కేదారేశ్వరుఁడు పంతోషించి పార్వతితోఁ గూడిన వాఁడై ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ సతయోఃకన్యయోఃప్రీతో రూపమప్సరసాం దదౌ ।
అనంతమాయురైశ్వర్యం దత్వాసోంతహితోఽభవత్ ॥

తా॥ సంతోషించినవాఁడై భగవంతుఁ డాకన్యలకు దేవతాస్త్రీలతో సమానమయిన సౌందర్యమును, దీర్ఘాయుర్దాయమును, సంపత్తులిచ్చి యంతర్ధానమాయెను.

శ్లో॥ అథ పుణ్యవతీంవవ్రే రాజాహ్యుజ్జయినీపతిః ।
అపరాంచోళభూపాలో నామ్నాభాగ్యవతీంతథా ॥

తా॥ అనంతరమీ వ్రతమహిమచే నుజ్జయినీరాజునకు పుణ్యవతిని, చోళదేశపురాజుకు భాగ్యవతిని యిచ్చి వివాహముచేసిరి.

శ్లో॥ తత్రాత్మజేతదావైశ్య సమృద్ధ్యోన్యవసత్సుఖం ।
సామ్రాజ్యసంపదంప్రాప్య పుత్రాల్లబ్ధ్వామహౌజసః॥

తా॥ ఆ కోమటి పుత్రికలట్లు భూపతుల కిచ్చినవారై వారు ప్రఖ్యాతులయిన పుత్రులనుబొంది సాటిలేని సంపత్తుగలవారై సుఖముగా నుండెను,

శ్లో॥ తేసు తేపితరంహృష్టం చక్రాతేమాతరంచవై ॥

తా॥ ఆపుత్రికలు తండ్రిని తల్లిని సంతోషింపఁ జేయుచుండిరి.

శ్లో॥ అథభాగ్యవతీకామ మైశ్వర్యమదమోహితా । కాలేగతే బహుతిథే వ్రతమేతన్మమోచసా । సౌభాగ్యహీనా పుత్రేణ సహభర్త్రానివాసితా ॥

తా॥ అనంతరము కొంతకాలము వెళ్ళఁగా భాగ్యవతి యను రెండవకన్యక భాగ్య గర్వముచే వ్రతముచేయుట మఱచిపోయెను. భగవంతుఁడు కోపించి యామెను, కొడుకును తండ్రిచే యింటనుండి వెడలగొట్టించెను.

శ్లో॥ వనసంచారఖిన్నాహి జగామశబరాలయం ।
తతఃపుత్రంసమాహూయ వాక్యమేతమవాచసా ॥

తా॥ ఆ భాగ్యవతి పుత్రునితోఁగూడ పెనిమిటిచే వెడలగొట్టఁబడి యరణ్యమందు దిరుగుచు నాయాసము నొంది కిరాతకులుండే పల్లెకుజేరి యచ్చట పుత్రునిఁబిలిచి యిట్లుచెప్పెను.

శ్లో॥ ఉపయేమేస్వసారంమే జ్యేష్ఠాముజ్జయినీపతిః ।
తాంద్రష్ట్వాధనమాదాయ శీఘ్రమాగచ్ఛపుత్రక ॥

తా॥ ఓ తనయా! నీపెత్తల్లిని ఉజ్జయినీపట్టణపు రాజు పెండ్లి చేసికొనెను. కాబట్టి నీ పెత్తల్లి నద్దకువెళ్లి మనకష్టములనుచెప్పి మనకు

గావలసిన కొంతధనముతీసికొని శీఘ్రముగారమ్మని తల్లి చెప్పి పంపిన దాయెను.

శ్లో॥ ఇతిమాతుర్వచశ్శ్రుత్వా జగామోజ్జయినీంపురీం ।
గత్వానివేదయామాస పుణ్యవత్యైసపుత్రకః ।
మాతుర్నివాసనంరాజ్యా ద్వనవాసంచదుస్సహం ॥

తా॥ ఆకుమారుఁడట్లు తల్లి చెప్పినవాక్యమును విని యుజ్జయినీ పట్టణమందుండు పెత్తల్లివద్దకేగి యామెతోఁదండ్రివలన దామిద్దరు రాజ్యమునుండి వెడలింపఁబడుటయు నడవియందు నివసింపఁబడుటయుఁజెప్పెను.

శ్లో॥ తతః పుణ్యవతీశ్రుత్వా దదౌతస్మైమహద్ధనం ।
ధనమాదాయసుప్రీతః ప్రయయౌమాతరంప్రతి ॥

తా॥ అనంతరము పెత్తల్లికుమారుఁడు చెప్పినవాక్యమును విని కొంత ధనమియ్యఁగా నా పిల్లవాఁడా ధనమును దీసికొని సంతోషముతోఁ దల్లివద్దకు ప్రయాణమై వచ్చుచుండెను.

శ్లో॥ గచ్ఛన్మార్గేహృతస్సోభూ ద్దేవేనాఽదృశ్యరూపిణా ॥

తా॥ ఆ పిల్లవాఁడు ధనమునుతీసికొని వచ్చుచుండఁగా మార్గములో భగవంతుఁడు కానరాకుండ ఆధనమును హరించెను.

శ్లో॥ పునర్గత్వాధనంగృహ్యా గచ్ఛతేస్తస్యతద్ధనం । జహారేశో జగాదైనం నితరాందీనమానసం । గచ్ఛభాగ్యవతీపుత్ర మావిషాదం వృధాకృధాః॥

తా॥ తిరిగి పెత్తల్లివద్దకేగి ధనమునుతీసుకొని వచ్చుచుండఁగా నాధనమును భగవంతుఁడపహరించి ధనము పోవుటచే నత్యంతము చింతాక్రాంతుఁడైన పిల్లవానితో నో చిన్నవాఁడా! ధనమునుగూర్చి వ్యర్థముగా నెందుకు దుఃఖించెదవు పొమ్మనెను.

శ్లో॥ అయోగ్యం భవతోహ్యేత ద్వ్రతంమేచరతాంధనం। ఇతిశ్రుత్వావచస్తస్య కిమేతదితివిస్మితః । పుణ్యవత్యైజగాదైత త్పునర్గత్వాసుతస్తదా । సాతద్విజ్ఞాయనిపుణా కారయామాసతద్వ్రతం ॥

తా॥ ఓపిల్లవాడా! నావ్రతమును చేయువారిధనము నీవుతీసుకొనిపెళ్లుటకు సాధ్యమైనదిగాదని చెప్పఁగా విని యచ్చట మనుష్యులులేరు- మాటవినిపించుచున్నది. ఇదియేమిచిత్రము- ఈపల్కువారెవరైయుండురని యాపిల్లవాడాశ్చర్యమునుబొంది తిరిగి పెత్తల్లియొద్దకువెళ్లి మార్గమధ్యంబున జరిగిన సమాచారముఁ జెప్పగా నేర్పరియైనయామె తెలుసుకొని యాపిల్లవానిచే కేదారేశ్వరవ్రతమునుచేయించెను.

శ్లో॥ భగిన్యాచయథాపూర్వం క్రియతామిత్యువాచహ॥

తా॥ పూర్వమువలెనే యీ వ్రతమును చేయుమని నీ తల్లికిఁజెప్పుమనెను.

శ్లో॥ వ్రతాంతేధనమాహృత్యా గచ్ఛన్ పూర్వాహృతంధనం సంప్రాప్యతత్రదేశాంతే పీతః స్థిత్వామహాధనం॥ ఆదాయమహతీం సేనాం గజాశ్వరథసంకులాం। జగామకాంచీనగరం పితాప్రత్యుద్గతో బలీ। మాతాపితాచసహిత శ్చిరకాలమవర్ధిత॥

తా॥ వ్రతమును సమాప్తినిబొందించి కొంతధనమును దీసికొని వచ్చుచుండగా నచ్చటఁబూర్వము హరింపబడిన ధనమగపడెను. ఆ ధనమును మఱియు కేదారేశ్వరునను గ్రహము వలన సంభవించిన ఏనుగులు ,గుఱ్ఱములు, రథములు మొదలగు గొప్పసేనతోఁగూడి బలవంతుఁడై కాంచీపట్టమునకుబోగా తండ్రియెదురొగ్గొని గృహమునకు దీసికొనివెళ్లెను. అనంతరము తండ్రితోను, తల్లితోనుగూడి చిరకాలము రాజ్యపరిపాలనచేసెను.

శ్లో॥ తదాప్రభృతిమాతాచ చకారవ్రతమాదరాత్ । సచ చోళనృపఃపీతస్తదాప్రభృతితద్వ్రతమ్॥

తా॥ అదిమొదలు తల్లి శ్రద్ధతో నీవ్రతమును జేయుచుండెను. చోళదేశాధిపతియు సంతోషించినవాడై యావ్రతమును చేయుచుండెను.

శ్లో॥ యన్నోక్తేన విధానేన యఃకరోతీప్సితంలభేత్॥

తా॥ ఎవరు శాస్త్రమందుఁ జెప్పఁబడినరీతిగా నీవ్రతమును జేయుచున్నారో వారు కోరినకోరిక సిద్ధించును,

శ్లో॥ ఇతివ్రతస్యమాహాత్మ్యం యేశృణ్వంతిపఠంతివా । తేషామపి మహాదేవః ప్రీతోభవతిసర్వదా॥

తా॥ ఎవరీవ్రతముయొక్క ప్రభావమును వినుదురో, చదువుదురో వారలకు భగవంతుడు సంతోషించి యనుగ్రహమొసఁగును.

శ్లో॥ ఆయుష్కరం పుష్టికరం శ్రీకరంచయశస్కరం । వ్రతమేతత్సముద్దిష్టం గౌతమేనమహాత్మనా। అత్మనోహి తమాకాంక్షన్ వ్రతమేత త్సమాచరేత్। మహతీం సంపదంప్రాప్య శివసాయుజ్యమాప్నుతే॥

తా॥ ఈ వ్రతమును ఆయుస్సు వృద్ధిచేయునదిగాను, పుష్టిని జేయునదిగాను సంపత్తునిచ్చునదిగాను కీర్తిని చేయునదిగాను మహానుభావుఁడగు గౌతమమహాముని చెప్పెనుగాన దనకుహితవునుగోరు ప్రతిమనుష్యుడు నీవ్రతమునుచేసినచో నిహలోకంబున గొప్పసంపత్తును బొంది యనంతరమున కైలాసమునుబొందును.

ఇతి శ్రీ స్కాందపురాణే కేదారవ్రతకల్ప స్సంపూర్ణః

---

# కేదారేశ్వర వ్రతకథా.

(ఉద్యాపన ప్రకరణం)

పూర్వము కైలాసపర్వతమందు బంగారుమేడలో రత్నఖచితమగు సింహాసనమందుఁగూర్చున్న శర్వాతుఁడయిన సాంబమూర్తినిఁ జూచి పార్వతీదేవి మిక్కిలిభక్తితోఁ గూడుకొన్నదగుచు నిట్లనువాక్యమును బల్కెను. ఏమనగా—ఓస్వామీ! నమస్కారము. సమస్తదేవతలకు దేవుడవై సమస్తలోకములకు ప్రభుడవై కరుణాస్థానభూతుడవై యుండెడు సాంబమూర్తీ! ఎవరు కేదారేశ్వరవ్రతమునుచేసి ఐశ్వర్యమును బొందిరో సవిస్తరముగా వినవలెనని కోరు

చున్నాను చెప్పుమనిఒకప్పుడు పార్వతిదేవి సాంబమూర్తిని యడిగెను. అప్పుడు ప్రియురాలవయిన పార్వతీ! వినుము. లోకంబున సమస్త వ్రతములలో ముఖ్యమైనది కేదారేశ్వరవ్రతము. ఈవ్రతముచేయుటచే సమస్తభోగములును, సమస్తైశ్వర్యములును, పుత్రపౌత్రాది సంపత్తులును, ధన కనక వస్తువాహనాది నానావిధ సంపత్తులును లభ్యమగును. ఈవ్రతమును మహాభక్తిశ్రద్ధలతో కార్తీకమాసమునందు ముప్పదిదినములు ఈశ్వరారాధనముచేయుటచేమహాగొప్పఫలముకలదు. ఆఫలమిట్టిదని చెప్పవీలులేదు. అనుభవించినగాని తెలియనేరదు. అఖండమయిన ఐశ్వర్యము యీవ్రతముచేయుటచేతనే లభ్యమగును. దారిద్ర్యము లేక ఐశ్వర్యముకలిగి సుఖముగావుండేవ్రతమని చెప్పెను. పిమ్మట యీవ్రత విధానమును, ఉద్యాపన క్రమముం జెప్పుచున్నాను వినుమనెను. ప్రతి సంవత్సరము కార్తీకశుద్ధమందుండే ప్రదోషదినంబునగాని, లేక సోమవారము శుక్రవారము శుక్లపూర్ణిమా మొదలగు పర్వదినములందుగాని ఈవ్రతమును చేయవలెను. ఈవ్రతముచేయదలచినవారు ముందుగా ఆ దినంబున గృహశుద్ధినిజేసి బంధువులనుబిలచి కల్పమందుంజెప్పబడిన ప్రకారము సాయంకాలంబున యీవ్రతమాచరింపవలెను, ఈవ్రతము నదీతీరమందుగాని, లేక స్వగృహమందుగాని చేయవలెను. అప్పుడు ౨౧ సంఖ్యలతోనుండు తాంబూలఫలపుష్ప దక్షిణలతోను (౨౧) సంఖ్యలు గలఅరిశెలు మొదలగు పిండివంటలతోను సర్వాంతర్యామియగు భగవంతుడయిన కేదారేశ్వరునకు పూజ సమర్పించవలెను. అట్లుగాక యేకరాశిగా నివేదన పదార్థములనుంచి పూజించవలెను. శక్తివంచన లేకుండా చేయవలెను. ఈవ్రతము యిరువదియొక్క సంవత్సరములు జరిపి ఉద్యాపనముజేసి యీవ్రతము తిరిగిప్రారంభించవలెను. ఆది యందుగాని మధ్యయందుగాని, అంతమందుగాని ఉద్యాపనము చేసియే తీరవలెను. ఓ పార్వతీ! ఉద్యాపనక్రమముం జెప్పుచున్నాను. వినుము. కార్తీక మాఘ, వైశాఖ శ్రావణ ఈనాలుగుమాసములలో మహాదోషములేకుండా పంచాంగశుద్ధిగల శుభదినంబు సాయంకాలంబున మంటపారాధనముచేసి (౨౧) కలశలు (౨౧)వస్త్రములు (౨౧ ఫల

ములు (౨౧) మారేడుదళములు (౨౧) రుద్రాక్షలు (౨౧) ప్రతిమలు (౨౧) దక్షిణలుంచి అందుమీద కేదారేశ్వరుని ఆవాహనముఁజేసి నాలుగుయామములు పూజజేసి పరదినంబున అగ్నిప్రతిష్ఠాపనముఁజేసి (౧౦౮)మారులు తత్పురుషాయవిద్మహే... ప్రచోదయాత్ ॥ అను మంత్రముచె ఆజ్యహోమమును జేసి పిమ్మటజయాదిపూర్ణాహుతి హోమములనుచేసి,గోదానభూదానములుచేసి (౨౧) స్త్రీలకు పసుపు కుంకుమవస్త్రములతోఁగూడ పూజించి, బ్రాహ్మణసమారాధనము చేసి పిమ్మట తాను యథావిధిగా బ్రాహ్మణులను తృప్తిజేసి బంధువులకును సమారాధనముచేసి భుజింపవలెను. తిరిగికార్తీకమాసము రాగానే వ్రతదినమందు వ్రతము సంకల్పించవలెను. ఉద్యాపనమును చేయుట మఱచినయెడల వ్రతమునిష్ఫలమగును. అని పార్వతితో సాంబమూర్తి చెప్పఁగా ఆపార్వతీదేవివలన బహుమందివిని లోకమందు యీవ్రతము నాచరించినవారైరి. పిమ్మట కొంతకాలము జరిగినతరువాతసూతమహర్షిని శౌనకాది ఋషీశ్వరులు అడిగిరి. ఓ మహానుభావా! కేదారవ్రతమును విధిగా జరిపి ఐశ్వర్యమును బొందినవారెవరని అడుగఁగా సూతుండిట్లనియె-

— సూతమహర్షి శౌనకాదులతోఁ జెప్పుట —

పూర్వము సాంబమూర్తి చెప్పఁగా పార్వతీదేవివలన ప్రసిద్ధికెక్కిన యీవ్రతమునుగూర్చి చెప్పుచున్నాను వినుండని సూతమహర్షి శౌనకాది మునీశ్వరులతోఁ జెప్పెను. పూర్వము ఆర్యావర్తమను దేశమందు సత్యవ్రతుఁడను నొక రాజుగలడు. ఆయనకు వ్రతలోపముచే దరిద్రత్వము సంభవించెను. ఇట్లుండఁగా ఆయనకు యిద్దరు కుమార్తెలు బుట్టిరి. ౧ పుణ్యవతి, ౨ భాగ్యవతి. ఈ పిల్లకాయలు అన్నవస్త్రములు లేక నిత్యము దుఃఖించుచుండిరి. తల్లిదండ్రాదులును దారిద్ర్యవశముచేత కష్టములో అతికష్టమని దుఃఖింపుచు కాలము

గడుపుచుండిరి. పిమ్మట ఈపిల్లకాయలు మంచితీర్థమునకై నదీతీరము నకు బోయిరి. అచ్చోట యీ కార్తీకవ్రతముఁ జేయుచున్న బహు జనులనుజూచిరి. ఓ తల్లీ! ఇది యేమివ్రతము ? ఏమిఫలమిచ్చును చెప్పుఁడని ప్రశ్నచేసిరి. పిమ్మట కేదారవ్రత ఫలమున్ను, విధాన మున్ను యీ స్త్రీలలో చెప్పిరి. పిమ్మట వారిద్దరు నదిలో స్నానము చేసినవారై మట్టిచే కలశమునేర్పరచి మట్టిచిగుళ్లుంచి మట్టియాడలు తోరాలుగాను, ఆకులు తమలపాకులుగాను, కాయలు పోకకాయలు గాభావించి కేదారేశ్వరదేవుని పూజచేసినవారైరి. పిమ్మట ఆదేవుని యొక్క కృపచే సమస్త పదార్థములు మంచి పదార్థములయినవి- ఇంటికిరాగానే యింటియందు లక్ష్మీదేవి ప్రవేశించెను. తండ్రి కుమా ర్తెలనుజూచి అమ్మా, ఈదినం బీలాటి సంపత్తులను జూచితిని, యేమి కారణమనెను. వ్రతముయొక్క ఫలితమని పుత్రికలు మనవిచేయఁగా సత్యమయిన వ్రతమని చెప్పెను కొంతకాలమునకు చోళదేశపు రాజ పుత్రుఁడును, విదర్భదేశపు రాజపుత్రుఁడును ప్రయాణమైపోవుచు యీ కన్యకలను జూచి ఆనందమునుబొంది వివాహమునకై యత్నిం చిరి, పిమ్మట నా కన్యల తండ్రి యింతకన్న గొప్ప సంబంధములు దొరకవని నిశ్చయించి విద్యుక్తముగా వివాహముఁ జేసి అత్తవారి గృహములకు పంపించివేసిరి. ఆ స్త్రీలు కాపురము చేయుచుండఁగా పుణ్యవతి అత్తవారింట ఆరుమాసములు గర్భిణిస్త్రీ అయియుండఁగా వ్రతము చేస్తూయుండెను. అప్పుడు పెనిమిటి భార్యనుజూచి యిది యేమివ్రతము, ఏమిపూజా, ఛీ ఛీ ఇట్లురమ్మనెను. అప్పుడా చిన్నది వ్రత నియమమం దుండుటచే పెనిమిటితో జవాబు చెప్పలేక వ్రతము చేయుచుండఁగా భర్త యీవ్రతమును దూషించినవాఁడై ఆ చిన్నది ధరించిన వ్రతతోరమును త్రెంపివేసి అగ్నిహోత్రములో వేసినవాఁ డాయెను. ఆ క్షణమందే దారిద్ర్యము వాటిల్లెను. ఇతరుకిపిచ్చ ప్రారం భించెను. ఆగృహమందు అగ్నిహోత్రుఁడు ప్రవేశించి సమస్తమును దహింపఁ జేయుచుండెను. సకలసంపత్తులు పోయెను. ఈ దంపతులు

నిలుచుటకు తావులేక అరణ్యమునకుఁజని, అచ్చట కేదారేశ్వరా! అను నామోచ్చారణతప్ప మఱియేమియు చెప్పలేరు. భార్యకూడా అరణ్యము ప్రవేశించెను. అచ్చట భర్త కనిపించనందున చింతించుచు ప్రాణముపోయిన బాగుండునని యేడ్చుచుండెను. ఒక బోయవాడు మార్గంబున వెళ్ళుచు యీచిన్నదానినిజూచి ఓతల్లీ, మీరెవరు? ఎందు లకువచ్చితిరని యడిగెను. అప్పుడాచిన్నది పరపురుషుని జూచిన పాపం బని సమాచారమును కన్నుల విప్పకుండా చెప్పెను. అతఁడా సమా చారమును దెలిసికొని అతని యాశ్రమమునకు తీసికొనివెళ్ళి కాపాడు చుండెను. పిమ్మట ఆమె ఒకపుత్రుని గనెను. ఆ పిల్లవాడు వయస్సు వచ్చినతరువాత తల్లియొక్క దుఃఖమును జూడలేక పెత్తల్లివద్దకు వెళ్లెను. ఆమె యీచిన్నవానినిజూచి దుఃఖించి కొంత ద్రవ్యమును మూలుగట్టి పంపెను. అప్పుడా బాలకుఁడు ధనమును దీసికొనివచ్చుచు మార్గమధ్యంబున ఒకనదియొద్దనుఁబెట్టి జలబాధలఁ దీర్చుకొనుచుండ ఆధనము నదిలో బడిపోయెను. రెండవతూరి పెత్తల్లివద్దకువెళ్ళఁగా గుమ్మడికాయలో వరహాలుపోసి యిచ్చెను. అది తీసికొనివచ్చుచుం డఁగా గరుత్మంతుడు దానియందావహించుటచే కనిపించనందున విచారపడుచు తిరిగి మూడవతూరి వెళ్ళెను. అప్పుడు చేలికట్టును తొలిపించి దానినిండా వరహాలుపోసి యిచ్చిపంపెను. దానిని తీసి కొనివచ్చుచుండఁగా చోరులు చిన్నవానితో యుద్ధముజేసి ధనము నపహరించిరి. పిమ్మట వెళ్ళలేక విచారపడుచు పెత్తల్లివద్దకు వెళ్లెను. అప్పుడామె జ్యోతిష్కులను బిలపించి యీ చిన్నవాని యొక్కయు, అతని తల్లిదండ్రులయొక్కయు దుర్దశ యెట్లుండెను. మంచికాల మున్నదా లేదా యని వారిని ప్రశ్నచేసెను. అప్పుడు వారు గ్రహ గతులను శోధించినవారై చిన్నవానికిని, అతని తల్లిదండ్రాదులకును, నష్టము సంభవించుచున్నది. ఇది దేవతలను పెద్దలను తిరస్కరించిన మహాదోషమని చెప్పుచు, ఇందుకు ఈశ్వరారాధన చేయుండని చెప్పి కార్తికమాసంబున కేదారేశ్వరునియొక్కపూజను యీ చిన్నవానిచే

జటిపించి యీతూరి ధనమిచ్చి పంపించవలసినదని సెలవిచ్చిరి. ఆపె విధిప్రకారముగా చేయించి తల్లికిని తండ్రికిని వ్రత తోరములును ప్రతప్రసాదమును ధనమును యిచ్చిపంపెను. ఆచిన్నవాడు వచ్చు చుండఁగా మూడుమాఱులు పోయిన ధనమంతయు మార్గమధ్యంబున నుండెను. ఆధనమును తీసికొని వచ్చుచుండఁగా తండ్రికూడా సంభ వించెను. ఉభయులుకలసి తల్లివద్దకువచ్చిరి. ఆ తల్లి యీచిన్నవానిని జూచి ఓకుమారా! నీతండ్రినిగూడ తీసికొనివస్తివని సంతోషించుచు ఆపె వెంటనే భర్తయొక్క పాదములనుకడిగి ఆ తీర్థోదకమును శిర స్సునధరించి కుమారుఁడు తెచ్చిన ప్రసాదమును, తోరమును ధరిం చెను. పిమ్మట కేదారేశ్వరస్వామిని స్మరింపుచు పూర్వమందుండు వారి గృహమునకు రాగా గృహము యథాప్రకారముగా నుండెను. అదిమొదలు యీవ్రతమును ప్రతిసంవత్సరముఁ జేయుచు పిమ్మట విధ్యుక్తముగా వ్రతోద్యాపనము గూడ చేసి ఇహలోకంబున సమస్త భోగములు అనుభవించినవారై పిమ్మట జీవితాంతంబున ఈశ్వర సన్నిధికిఁ బ్రవేశించినవారైరి. ఈ కేదారేశ్వరవ్రతము చోళదేశమం దుండు పుణ్యవతి చేయఁగా ఆమెవలన మఱికొందరు విని యీ వ్రత మును జేసినవారైరి. ఈకథను వినువారికిని, ఆచరించువారికిని గొప్ప ఫలము గలదు. అని సూతమహర్షి శౌనకాదులతోఁ జెప్పెను-పిమ్మట వారు క్రమముగా శిష్యులకు బోధించిన పిమ్మట క్రమముగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు సమస్తమయిన వారు యీవ్రతముఁజేయుచు ధర్మార్థ కామ మోక్షములను బొందు చున్నారని మహర్షులు చెప్పినవారైరి. ఈ వ్రతము భూమియందు విస్తరించెను.

ఇతి భవిష్యోత్తర పురాణే । పార్వతీ పరమేశ్వర సంవాదే-
కేదారేశ్వర వ్రతోద్యాపన క్రమం
సంపూర్ణమ్.

ఓం పార్వత్యైనమః । మహాదేవ్యై । జగన్మాత్రే । సరస్వత్యై । చండికాయై । లోకజనన్యై । సర్వదేవాధిదేవతాయై । గౌర్యై । పరమాయై । ఈశాయై । నగేంద్రతనయాయై । సత్యై । బ్రహ్మచారిణ్యై । శర్వాణ్యై । దేవమాత్రే । త్రిలోచన్యై । బ్రహ్మణ్యైనమః । వైష్ణవ్యై । రౌద్ర్యై । కాళరాత్ర్యై । తపస్విన్యై । శివదూత్యై । విశాలాక్ష్యై। చాముండాయై । విష్ణుసోదర్యై । చిత్కళాయై। చిన్మయాకారాయై । మహిషాసురమర్దిన్యై । కాత్యాయన్యై। కాలరూపాయై । గిరిజాయై । మేనకాత్మజాయై । భవాన్యై । మాతృకాయై । మహాగౌర్యై । రామాయై । రమాయై । శుచిస్మితాయై । బ్రహ్మస్వరూపిణ్యై। రాజ్యలక్ష్మ్యై। శివప్రియాయై । నారాయణ్యై। మహాశక్త్యై । నవోఢాయై । భాగ్యదాయిన్యై । అన్నపూర్ణాయై । సదానందాయై । యౌవనాయై । మోహిన్యై । అజ్ఞానశుద్ధ్యైనమః । జ్ఞానగమ్యాయై । నిత్యాయై । నిత్యస్వరూపిణ్యై కమలాయై । కమలాకారాయై । రక్తవర్ణాయై । కళానిధయే । మధుప్రియాయై। కల్యాణ్యైనమః । కరుణాయై । జనస్థానాయై । వీరపత్న్యై । విరూపాక్ష్యై । వీరాధితాయై । హేమాభాసాయై । సృష్టిరూపాయై । సృష్టిసంహారకారిణ్యై । రంజనాయై । యౌవనాకారాయై । పరమేశప్రియాయై । పరాయై । పుష్పిణ్యై । పురుషాకారాయై। పురుషార్థప్రదాయిన్యై । మహారూపాయై । మహారౌద్ర్యై । కామాక్ష్యై । వామదేవ్యై। వరదాయై । భయనాశిన్యై । వాగ్దేవ్యై । వచన్యై । వారాహ్యై । విశ్వతోషిణ్యై। వర్ధనీయాయై । విశాలాక్షాయై। కులసంపత్ప్రదాయిన్యై। ఆర్తదుఃఖచ్ఛేదదక్షాయై । అంబాయై । నిఖిలయోగిన్యై । సదాపురస్థాయిన్యై । తరోర్మూలతలంగతాయై। హరవాహసమాయుక్త మునిమోక్షపరాయణాయై । ధరాధర భవాయై । ముక్తాయై । పరమంత్రాయై । కరప్రదాయై । కల్యాణై । వాగ్భవ్యై । దేవ్యై । క్లీంకారిణ్యై । సంవిదే । ఈశ్వర్యై। హ్రీంకారాబీజాయై । శాంభవ్యై । ప్రణవాత్మికాయై । శ్రీమహాగౌర్యైనమః— సంపూర్ణము.

# అనంతవ్రతకల్పము.



ఆదౌ దీపారాధనం కృత్వా గణపతిపూజాం విధిప్రకారేణ కుర్యాత్ ॥ తతః యమునాపూజాంచకుర్యాత్ ॥ ఏవంగుణ విశేషణ విశిష్టాయామస్యాం శుభతిథౌ అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య శుభ ఫలావాప్త్యర్థం వర్షేవర్షే ప్రయుక్త శ్రీమదనంత పద్మనాభ దేవతా ముద్దిశ్య శ్రీమదనంతపద్మనాభ దేవతా ప్రీత్యర్థం పద్మపురాణోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచారపూజాంకరిష్యే॥

తదంగత్వేనకలశ పూజాంకరిష్యే ॥ కలశంగంధపుష్పాక్షతైరభ్యర్చ్య- కలశస్యోపరిహస్తం నిధాయ॥ శ్లో॥కలశస్యముఖేవిష్ణుఃకంఠే రుద్రస్సమాశ్రితః। మూలేతత్రస్థితో బ్రహ్మామధ్యేమాతృగణాస్స్మృతాః కుక్షౌతుసాగరాస్సర్వే సప్తద్వీపావసుంధరా ! ఋగ్వేదోథయజుర్వేద స్సామవేదోహ్యథర్వణః ॥ అంగైశ్చసహితాస్సర్వే కలశాంబుసమాశ్రితాః। ఆయాంతుదేవపూజార్థం దురితక్షయకారకాః। గంగేచయమునేచైవ గోదావరిసరస్వతీ। నర్మదేసింధుకావేరీ జలేస్మిన్‌సన్నిధింకురు॥ ఏవంకలశపూజాంకృత్వా మయాచరిష్య మాణానంతవ్రతపూర్వాంగ యమునాపూజాంకరిష్యే॥

— అథ యమునాపూజా —

శ్లో॥ క్షీరోదార్ణవ సంభూతే ఇంద్రనీలసమప్రభే । ధ్యానం కరోమి యమునే విష్ణురూపేనమోస్తుతే॥యమునాయైనమః॥ ధ్యాయామి॥ శ్లో॥ యమునేతేనమస్తుభ్యం సర్వకామప్రదాయినీ । అవాహయామిభక్త్యాత్వాం సాన్నిధ్యంకురుసువ్రతే॥ఆవాహయామి॥శ్లో॥ యమునేతేనమస్తుభ్యం సర్వకామప్రదాయినీ।రత్నసింహాసనం దేవీ స్వీకురుష్వమయార్పితం॥ఆసనంసమర్పయామి॥శ్లో॥సర్వేసముద్రాస్సరితఃతీర్థాః

నిజలదానదాః। ఆయంతుదేవీపూజార్థం దురితక్షయకారకాః॥ అర్ఘ్యం సమర్పయామి॥ శ్లో॥ సింహాసనసమారూఢే దేవశక్తిసమన్వితే।పాద్యం గృహాణదేవేశీ సర్వలక్షణసంయుతే॥ పాద్యంసమర్పయామి॥ శ్లో॥ హార నైదూర్యసంయుక్తే సర్వలోకహితేశివే। గృహాణాచమనందేవి శంక రార్థశరీరిణీ॥ ఆచమనీయం సమర్పయామి॥ శ్లో॥ దేవపాదేనమస్తుభ్యం సర్వలోకహితప్రియే। సర్వపాపప్రశమనం తుంగభద్రేనమోస్తుతే॥ స్నానంసమర్పయామి॥శ్లో॥గురుపాదేనమస్తుభ్యం సర్వలక్షణసంయుతం సువస్త్రంకురుమేదేవి తుంగభద్రేనమోస్తుతే॥ వస్త్రంసమర్పయామి॥ శ్లో॥ కృష్ణవేణినమస్తుభ్యం కృష్ణవేణిసులక్షణే। మధుపర్కంగృహా ణేదం మయాదత్తంశుభప్రదే॥ మధుపర్కంసమర్పయామి॥ శ్లో॥నందీ పాదేనమస్తుభ్యం శంకరార్థశరీరిణీ। సర్వలోకహితేతుభ్యం భీమరథ్యై నమోస్తుతే॥ ఆభరణానిసమర్పయామి॥ సహ్యపాదసముద్భూతే సర్వ కామఫలప్రదే। సర్వలక్షణసంయుక్తే భవనాశినితేనమః॥ ఉత్తరీయం సమర్పయామి॥ శ్లో॥ కృష్ణసారసమూద్భూత గంగేత్రిపథగామినీ। జటాజూటసమూద్భూతే సర్వకామఫలప్రదె॥ గంధాన్సమర్పయామి॥ శ్లో॥ గోదావరినమస్తుభ్యం సర్వాభీష్టప్రదాయినీ। స్వీకురుష్వజగద్వం ద్యే అక్షతానమలాన్శుభాన్॥ అక్షతాన్సమర్పయామి॥ శ్లో॥ మందా రైపారిజాతైశ్చ పాటలాశోకచంపకైః। పూజయామితవప్రీత్యై వరదె భక్తవత్సలే॥ పుష్పాణిపూజయామి॥

## ♦♦ అథాంగపూజా ♦♦

చంచలాయైనమః। పాదౌపూజయామి॥ సుజంఘాయైనమః। జంఘేపూజయామి॥ చపలాయైనమః। జానునీపూజయామి॥ పుణ్యా యైనమః। ఊరూపూజయామి॥ కమలాయైనమః। కటింపూజయామి॥ గోదావర్యైనమః। స్తనౌపూజయామి॥ భవనాశిన్యైనమః। కంఠంపూజ యామి॥ తుంగభద్రాయైనమః। ముఖంపూజయామి॥ సుందర్యై। లలా టంపూజయామి॥ దేవ్యైనమః। నేత్రేపూజయామి॥ పుణ్యశ్రవణకీర్త నాయై। కర్ణౌపూజయామి॥ సునాసికాయైనమః। నాసికాం పూజ యామి॥ భాగీరథ్యై। శిరఃపూజయామి॥ యమునాయయినమః। సర్వా

ణ్యంగానిపూజయామి ॥ శ్లో॥ దశాంగంగుగ్గులోపేతం చందనాగరు సంయుతం। యమునాదైనమస్తుభ్యం ధూపోయం ప్రతిగృహ్యతాం ॥ ధూపంసమర్పయామి॥ శ్లో॥ ఘృతవర్తియుతందీపం త్రైలోక్యతిమిరాపహం। గృహాణమంగళందేవీ సర్వేశ్వరినమోస్తుతే॥ దీపందర్శయామి॥ శ్లో॥ సర్వభక్ష్యైశ్చభోజ్యైశ్చ రసైష్షడ్భిస్సమన్వితం। నైవేద్యంగృహ్యతాందేవి యమునాదైనమో నమః॥ నైవేద్యంసమర్పయామి॥ శ్లో॥ ఇదం ఫలంమయాదేవ స్థాపితం పురతస్తవ గృహాణసురపూజితే ॥ హస్తప్రక్షాళనంసమర్పయామి ॥ శ్లో॥ కర్పూర వాసితంచూర్ణ క్రముకాద్యైస్సమన్వితం। తాంబూలంగృహ్యతాం దేవి యమునాదైనమోస్తుతే॥ తాంబూలం సమర్పయామి॥

శ్లో॥ ఘృతవర్తిసహస్రైశ్చ కర్పూరశకలైస్తథా। నీరాజనం మయాదత్తం గృహాణవరదోభవ! శ్రీయమునాదైనమః ॥ నీరాజనంస మర్పయామి॥ శ్లో॥ చంపకైర్జాజిపున్నాగైః కేతకీకరవీరకైః। కమలైః కుముదైఃపుష్పై స్సదాత్వాంపూజయామ్యహమ్॥ శ్రీయము... నమః॥ మంత్రపుష్పం సమర్పయామి॥ శ్లో॥ యానికానిచ... పదేపదే ॥ శ్రీ యము... నమః॥ ప్రదక్షిణనమస్కారాంత్సమర్పయామి॥ శ్లో॥ నృత్తై శ్చగీతవాద్యైశ్చ పురాణశ్రవణాదిభిః। రాజోపచారైర్గృహాణ సంతు ష్టాభవపార్థివాః ॥

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజాక్రియాదిషు। న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందేతమచ్యుతం। మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనందయానిధే ॥ శ్లో॥ అనయాధ్యానావాహనాది షోడశోపచారపూజయాభగవాం త్సర్వాత్మకఃయమునాపూజితం మయా దేవపరిపూర్ణం తదస్తుతే॥ ...ఏతత్ఫలం శ్రీ×మస్తు॥ ... ...

ఇతి పూజావిధానం సంపూర్ణమ్.

---

ఆచమ్య ...ర్థం పూర్వోక్తైవ ప్రయుక్త శ్రీమదనంత పద్మనాభ దేవతా ముద్దిశ్య ...ప్రీత్యర్థం ... షోడశోపచారపూజాం కరిష్యే। ఇతిసంకల్ప్య తతః ప్రాగ్భాగే నూతనవస్త్రేణ మంటపమాసాద్య తస్యోపరి తండు.

లాన్నిధాయం। తన్మధ్యే తామ్రనిర్మిత ప్రధానకలశం నిధాయ ॥ నూతన వస్త్రమావేష్ట్య అత్రవిధిప్రకారేణ నిర్మితదర్భకూర్చం నిధాయ - ఆదౌపీఠపూజాంకృత్వా॥ తతః అష్టదిక్పాలక పూజాంకుర్యాత్ ॥ ఆచమ్య ॥ పునసంకల్ప్య॥ కలశపూజాంచకుర్యాత్ ॥ తతఃపద్మనాభస్వామి దేవతాపూజాంచకుర్యాత్॥శ్రీమదనంత పద్మనాభం ధ్యాయేత్॥

శ్లో॥ కృత్వాదర్భమయందేవం పరిధానసమన్వితం। ఫణైస్సప్తభిరావిష్టంపింగళాక్షంచతుర్భుజం॥శ్లో॥దక్షిణాగ్రకరేపద్మశంఖంతస్యాప్యధఃకరే। చక్రమూర్ధ్వకరేవామేగదాంతస్యాప్యధఃకరే॥ శ్లో॥దధానంసర్వలోకేశం పీతాంబరధరంహరిం। దుగ్ధాబ్ధిశయసంధ్యాత్వా చైవమావాహయేత్సుధీః। నారాయణాయవిద్మహే... ... ...ప్రచోదయాత్॥ ఇతిమంత్రేణ శ్రీమదనంతంధ్యాయేత్॥ ధ్యానం॥ శ్లో॥ ఆగచ్ఛానంత దేవేశ తేజోరాశేజగత్పతే । ఇమాం మయాకృతాం పూజాం గృహాణసురస త్తమ॥ ఆవాహనం॥ అనంతాయనమస్తుభ్యంసహస్రశిరసేనమః। రత్నసింహాసనంచారుప్రీత్యర్థంప్రతిగృహ్యతాం॥ఆసనంసమర్పయామి॥శ్లో॥తస్యాగ్రతోదృఢంసూత్రంకుంకుమాక్తంసుదోరకం। చతుర్దశగ్రంథియుక్తముపకల్ప్యప్రపూజయేత్ ॥ దోరస్థాపనం॥ అనంతగుణరత్నాయ విశ్వరూపధరాయచ ।ఖఘ్యందదామితే దేవగృహాణార్ఘ్యంనమోస్తుతే॥ అర్ఘ్యం...మి॥శ్లో॥సర్వాత్మన్ సర్వలోకేశ సర్వవ్యాపిసనాతన । పాద్యంగృహాణభగవన్ దివ్యరూపనమోస్తుతే। పాద్యం సమర్పయామి॥ శ్లో॥ దామోదరనమస్తేస్తు వరకార్ణవతారక। గృహాణాచమనందేవ మయాదత్తంహికేశవ ॥ ఆచమనీయంసమర్పయామి॥ శ్లో॥అనంతానంతదేవేశ హ్యానంతఫలదాయక। దధిమధ్వాజ్యసంమిశ్రం మధుపర్కందదామితే ॥ మధుపర్కంసమర్పయామి ॥ శ్లో॥అనంతగుణగంభీరవిశ్వరూపధరాయచ।పంచామృతైశ్చవిధివత్స్నాపయామిదయానిధే ॥ పంచామృతస్నానం॥ శ్లో ॥ అనంతగుణరూపాయ విశ్వరూపధరాయచ । నమోమహాత్మనేదేవాయఅనంతాయ నమోనమః॥ ......శుద్ధోదకస్నానం......మి॥శ్లో॥శ్రీధరాయనమస్తుభ్యం విష్ణవేపరమాత్మనే।పీతాంబరం ప్రదాస్యామిఅనంతాయ నమో

స్తుతే॥ వస్త్రం సమర్పయామి ॥ శ్లో॥ నారాయణనమస్తేస్తు త్రాహి మాంభవసాగరాత్ । బ్రహ్మసూత్రం చోత్తరీయం గృహాణ పురుషోత్తమ ॥ ఉపవీతంసమర్పయామి॥ శ్లో॥శ్రీగంధంచందనోన్మిశ్రం కుంకుమాదిభిరన్వితం । విలేపనంసురశ్రేష్ఠం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ గంధాన్ సమర్పయామి॥శ్లో॥ శాలీయాన్ తండులాన్ దివ్యాన్ మయా దత్తాన్ శుభావహాన్।అక్షతానంతగోవింద గృహాణ పురుషోత్తమ॥ అక్షతాన్ సమర్పయామి॥శ్లో॥ కరవీరైర్జాతి కుసుమైశ్చంపకైర్బకులైః శుభైః। శతపత్రైశ్చ కల్హారైరర్చయే పురుషోత్తమ ॥ పుష్పైః పూజయామి॥

అథాంగపూజా.

అనంతాయనమః-పాదౌపూజయామి॥ శేషాయనమః-గుల్ఫౌ॥ కాలాత్మనేనమః- జంఘే॥ విశ్వరూపాయనమః- జానునీ ॥ జగన్నాథాయనమః-గుహ్యం॥పద్మనాభాయనమః-నాభిం॥ సర్వాత్మనేనమః- కుక్షిం ॥ శ్రీవత్సవక్షసేనమః- వక్షస్థలం॥ చక్రహస్తాయనమః- హస్తాన్॥ ఆజానుబాహవేనమః- బాహూన్ ॥ శ్రీకంఠాయనమః- కంఠం॥ చంద్రముఖాయనమః- ముఖం॥ వాచస్పతయేనమః- వక్త్రం ॥ కేశవాయనమః- నాసికాం ॥ నారాయణాయనమః- నేత్రే ॥ గోవిందాయనమః- శ్రోత్రే॥ అనంతపద్మనాభాయనమః- శిరః॥విష్ణవేనమః సర్వాణ్యంగానిపూజయామి॥

అథాష్టోత్తర శతనామపూజా.

ఓం శ్రీకృష్ణాయనమః, కమలనాథాయనమః, సనాతనాయ నమః, వాసుదేవాయనమః, పుణ్యాయ, లీలామానుషవిగ్రహాయ, శ్రీవత్సకౌస్తుభధరాయ, యశోదావత్సలాయనమః, హరయేనమః, చతుర్భుజాత్తచక్రాసిగదాశంఖాద్యుదాయుధాయ, దేవకీనందనాయ, శ్రీశాయ, నందగోపప్రియాత్మజాయ. యమునావేగసంహారిణే బలభద్రప్రియానుజాయనమః, పూతనాజీవితహరాయ, శకటాసురభంజనాయ, నందవ్రజజనానందినే సచ్చిదానందవిగ్రహాయ, నవనీతవిలిప్తాంగాయనమః, నవనీతనటాయ, అనఘాయ, నవనీతనవాహారాయ, ముచుకుందప్రసాదకాయ, షోడశస్త్రీసహస్రేశాయ, త్రిభంగి

నేనమః, మధురాకృతయే, శుకవాగమృతాబ్ధిందవే, గోవిందాయ, యోగీనాంపతయే, వత్సవాటచరాయ, అనంతాయ, ధేనుకాసురభంజనాయ, తృణీకృతతృణావర్తాయ, యమళార్జునభంజనాయ, ఉత్తాలభేత్రే, తమాలశ్యామలాకృతయే, గోపగోపీశ్వరాయ, యోగినే కోటిసూర్యసమప్రభాయ, ఇళాపతయేనమః, పరంజ్యోతిషే, యాదవేంద్రాయ, యదూద్వహాయ, వనమాలినే, పీతవాసనేనమః, పారిజాతాపహారకాయ, గోవర్ధనాచలోద్ధర్త్రే, గోపాలాయ, సర్వపాలకాయనమః, అజాయ, నిరంజనాయ, కామజనకాయ, కంచలోచనాయ, మధుఘ్నే, మధురానాథాయనమః, ద్వారకానాయకాయ, బలినే, బృందావనాంతసంచారిణే, తులసీధామభూషణా, శమంతకమణిహర్త్రే, నరనారాయణాత్మకాయ,

కుబ్జాంకృష్ణాంబరధరరాయ, మాయినే, పరమపురుషాయ, ముష్టికాసురచాణూరమల్ల యుద్ధవిశారదాయ, సంసారవైరిణేనమః, కంసరాయనమః, మురారయేనమః, నరకాంతకాయనమః, అనాదిబ్రహ్మచారిణేనమః, కృష్ణావ్యసనకర్శకాయనమః, శిశుపాలశిరచ్ఛేత్రేనమః, దుర్యోధనకులాంతకాయ, విదురాక్రూరవరదాయ, విశ్వరూపప్రదర్శకాయ, సత్యవాచేనమః, సత్యసంకల్పాయ, సత్యభామరతాయ జయినేనమః, సుభద్రాపూర్వజాయ, విష్ణవేనమః, భీష్మముక్తిప్రదాయకాయ, జగద్గురవేనమః, జగన్నాథాయ, వేణునాదవిశారదాయ, వృషభాసురవిధ్వంసినే. బాణాసురకరాంతకాయ, యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే, బర్హి

బర్హావతంసికాయ, పార్థసారధయే, అవ్యక్తాయ, గీతామృతమహోదధయే, కుబ్జాకృష్ణాంబరధరాయ, కాళీయ ఫణిమాణిక్య రజితశ్రీపదాంబుజాయనమః, దామోదరాయ, యజ్ఞభోక్త్రేనమః, దానవేంద్రవినాశకాయ, నారాయణాయ, పరబ్రహ్మణే, పన్నగశనవాహనాయ, జలక్రీడాస మాసక్తగోపీవస్త్రాప హారకాయనమః, పుణ్యశ్లోకాయ, తీర్థపాదాయ, వేదవేద్యాయ, దయానిధయే, సర్వదేవాత్మకాయ, సర్వగ్రహరూపిణే, పరాత్పరాయ, శ్రీమదనంతపద్మ నాభస్వామినే, నానావిధపత్రపుష్పాణి సమర్పయామి॥

అథదోరపూజా.

కృష్ణాయనమః- ప్రథమగ్రంథింపూజయామి ॥ విష్ణవేనమః- ద్వితీయగ్రంథింపూజయామి ॥ విష్ణవేనమః - తృతీయగ్రంథింపూజయామి ॥ కాలాయనమః- చతుర్థగ్రంథింపూజయామి ॥ బ్రహ్మణేనమః- పంచమగ్రంథింపూజయామి॥ భాస్కరాయనమః - షష్ఠగ్రంథింపూజయామి॥ శేషాయనమః- సప్తమగ్రంథింపూజయామి॥ సోమాయనమః- అష్టమగ్రంథింపూజయామి॥ ఈశ్వరాయనమః- నవమగ్రంథింపూజయామి॥ విశ్వాత్మనేనమః- దశమగ్రంథింపూజయామి॥ మహాకాలాయనమః- ఏకదశగ్రంథింపూజయామి॥ సృష్టిస్థిత్యంతధారిణేనమః-ద్వాదశగ్రంథింపూజయామి॥ అచ్యుతాయనమః- త్రయోదశగ్రంథింపూజయామి॥ అనంతపద్మనాభాయనమః- చతుర్దశగ్రంథిం పూజయామి॥ శ్లో॥వనస్పతిభవైర్దివ్యైర్నానాగంధైశ్చసంయుతః- ఆఘ్రేయస్సర్వదేవానాం ధూపోయంప్రతిగృహ్యతాం॥ ధూపంసమర్పయామి॥ శ్లో ॥సాజ్యంత్రివర్తిసంయుక్తం వహ్నినాజ్యోతితంమయా। గృహాణమంగళందీపం త్రైలోక్యతిమిరాపహం॥ దీపం...మి॥ శ్లో॥ నీరాజనంగృహాణేదం పంచవర్తిసమన్వితం। తేజోరాశిమయందత్తం గృహాణత్వంసురేశ్వర॥ ... ...నీరాజనం॥శ్లో॥ అన్నంచతుర్విధంభక్ష్యైరసైష్షడ్భిస్సమన్వితం । మయానివేదితంతుభ్యంస్వీకురుష్వజనార్దన॥ నైవేద్యం॥పూగీఫలసమాయుక్తం,నాగవల్లీదళైర్యుతం। కర్పూరచూర్ణసంయుక్తంతాంబూలం ప్రతిగృహ్యతాం॥ తాంబూలం॥ నమస్సర్వహితార్థాయ జగదాధారమూర్తయే।సృష్టిస్థిత్యంతరూపాయ అనంతాయనమోనమః॥మంత్రపుష్పం శ్లో॥యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ । తానితానిప్రణశ్యంతి ప్రదక్షిణపదేపదే ॥ ప్రదక్షిణం ॥ శ్లో॥ నమస్తే దేవదేవేశ నమస్తే ధరణీధర।నమస్తే సర్వనాగేంద్ర నమస్తే పురుషోత్తమ నమస్కారాన్సమర్పయామి ॥ శ్లో ॥ దారిద్ర్యనాశనార్థాయపుత్రపౌత్రప్రవృద్ధయే। అనంతాఖ్యమిదంసూత్రం ధారయామ్యహముత్తమం॥దోరగ్రహణం॥ శ్లో॥అనంతసంసారమహాసముద్ర మగ్నంసమభ్యుద్ధరవాసుదేవ । అనంతరూపోవినయోజయస్వహ్యనతం

సూత్రాయనమోనమస్తే॥దోరనమస్కారః॥ శ్లో॥ సంసారగహ్వరగుహా సుసుఖంవిహర్తుంవాంఛంతియేకురుకులోద్భవశుద్ధసత్వాః - సంపూజ్యచత్రిభువనేశమనంతరూపం బధ్నంతిదక్షిణకరేవరదోరకంతే ॥ దోరబంధనం॥శ్లో॥అనంతానంతదేవేశ అనంతఫలదాయక।సూత్రగ్రంథిషుసంస్థాయ విశ్వరూపాయతేనమః- వాయనదానశ్లోకః ॥ అనంతః ప్రతిగృహ్ణాతిఅనంతోవైదదాతిచ । అనంత స్తారకోద్వాభ్యామనంతాయవమోనమః ఇతిపూజావిధానం సంపూర్ణమ్.

## అనంతవ్రతకథారంభః.

సూతః॥ శ్లో॥ అరణ్యేవర్తమానాస్తే పాండవాదుఃఖకర్శితాః।
కృష్ణందృష్ట్వామహాత్మానం ప్రణిపత్యయథాక్రమం ॥

తా॥ సూతుఁడు చెప్పుచున్నాఁడు. ఈ ప్రకారము పాండవులరణ్యమందు సంచరించుచు దుఃఖముచేఁబీడితులై మహానుభావుండగు కృష్ణమూర్తినిజూచి ధర్మరాజు మొదలగువారు క్రమప్రకారంబుగా నమస్కరించిరి.

యుధిష్ఠిరః॥ శ్లో॥ అహందుఃఖేనసంజాతో భ్రాతృభిఃపరివారితః।
కథంముక్తిర్భవేదాస్మాక మనంతాద్దుఃఖసాగరాత్ ॥

తా॥ ధర్మరాజడుగుచున్నాఁడు. ఓస్వామీ! నేను తమ్ములతోఁగూడ అరణ్యమందుఁదిరుగుచున్నవాఁడనై దుఃఖవంతుండనైతి, గాన అంతులేని యీ దుఃఖసముద్రమునుండి యెట్లువిముక్తుండనయ్యెదనో తగినయుపాయమును జెప్పుము.

శ్లో॥ కందేవంపూజాయిష్యామి రాజ్యంకేనాప్నుయామ్యహం ।
అథనాకింవ్రతంకృత్వా త్వత్ప్రసాదాద్భవేద్ధితం॥

తా॥ ఏదేవునిఁబూజింపవలయును? దేనిచే నేను రాజ్యమును దిరిగి పొందఁగలను లేక యేవ్రతమొనర్చి నీ యనుగ్రహమువలన ఇష్టసిద్ధినిఁబొందెదనో చెప్పుమని ధర్మరాజు శ్రీకృష్ణమూర్తినడిగెను.

కృష్ణః॥ శ్లో॥ అనంతవ్రతమస్త్యేక మథావశ్యమనుత్తమం।
సర్వపాపహరంనౄణాం స్త్రీణాం చైవయుధిష్ఠిర॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు. ఓధర్మరాజా! పురుషుల యొక్కయు స్త్రీలయొక్కయు సమస్త పాపములను బోగొట్టునదియు అవశ్యము చేయఁదగినదియు సాటిలేనిదయిన అనంతవ్రతమనునది యొకటికలదు.

శ్లో॥ శుక్లపక్షేచతుర్దశ్యాం మాసిభాద్రపదేభవేత్।
తస్యానుష్ఠానమాత్రేణ సర్వపాపం,వ్యపోహతి॥

తా॥ భాద్రపద శుక్లచతుర్దశయందుఁ జేయఁదగినది. ఆవ్రతము జేసినతోడనే సమస్త పాపములు నశింపగలవు.

యుధిష్ఠిరః॥ శ్లో॥ కృష్ణకోఽయమనంతాఖ్యః ప్రోచ్యతేయస్త్వయా
విభో। సింహశేషఅథాహోస్వి దనంతస్తక్షకస్మృతః।

తా॥ ధర్మరాజు అడుగుచున్నాఁడు. ఓకృష్ణా! ఓస్వామీ! నీవే యనంతునిగూర్చి చెప్పితివో ఆయనంతు డెవరు? శేషుడాలేక తక్షకుడా చెప్పుము.

శ్లో॥ పరమాత్మాథవానంత ఉతాహోబ్రహ్మగీయతే।
కఏషోఽనంతసంజ్ఞోవై తథ్యంమేబ్రూహి కేశవ!

తా॥ ఓకృష్ణా! అనంతుడనఁగాఁ బరమాత్ముండని చెప్పఁబడెనా? బ్రహ్మగాజెప్పబడెనా? ఈయనంతుడెవరు? యథార్థముగ నంతయుఁజెప్పుమని ధర్మరాడిగెను.

కృష్ణః॥ శ్లో॥ అనంతఇత్యహంపార్థ మమరూపంనిబోధిత।
ఆదిత్యాదిగ్రహాత్మా సౌ యఃకాలఇతిపఠ్యతే॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాడు. ఓధర్మరాజా! అనంతుఁడనఁగా నేనే. అనంతుని నాస్వరూపముగాఁ దెలిసికొనవలయును. సూర్యుఁడు మొదలగు గ్రహరూపములుబొంది యెవఁడు కాలరూపుఁడయి యుండునో యతండు అనంతుఁడని జెప్పఁబడియెను.

శ్లో॥ కలాకాష్ఠాముహూర్తాది దివారాత్రిశ్శరీరవాన్। పక్షమాసర్తువర్షాది యుగకాలవ్యవస్థయా॥ యోఽయంకాలోమహాఖ్యాతోసోఽనంతఇతికీర్త్యతే॥

తా॥ కలయనియు, కాష్టయనియు, ముహూర్తమనియు, పగలనియు రాత్రియనియు శరీరముకలవాఁడనియు, పక్షమనియు, మాసమనియు, ఋతువనియు వర్షాకాలమనియు, యుగములనియు, భేదములచేరిప కాలము ప్రసిద్ధికెక్కి యున్నదో యటువంటి కాలస్వరూపుఁడే యనంతుఁడు

శ్లో॥ సోఽహంకృష్ణోవతీర్ణోస్మి ఉత్రిభూభారోత్తారణాయచ।
దానవానాంవధార్థాయ వసుదేవ కులోద్భవః॥

తా॥ అట్టియనంతుని స్వరూపమైననేను భూభారము నణచుట కొఱకును రాక్షసులను వధించుట కొఱకును వసుదేవునియొక్క వంశమందు కృష్ణమూర్తియను నామముగలవాడనై జనించితిని.

శ్లో॥ మాంవిద్ధిసతతంపార్థ సాధూనాం పాలనాయచ। అనాదిమధ్యనిధనం కృష్ణంవిష్ణుం। హరింశివం॥ వైకుంఠం భాస్కరంసోమం సర్వవ్యాపిన మీశ్వర। ప్రత్యగ్రూపంమహాబాహు యోగిధ్యేయము నుత్తమం॥ విశ్వరూపమనంతంచ యస్మిన్స్మిందాశ్చతుర్దశ॥

తా॥ ఓధర్మరాజా! ఎల్లప్పుడు సజ్జనులనుపాలన చేయుటకొఱకు నవతరించెడివాఁడనని, ఆదిమధ్యాంతములు,లేనివాడనని, కృష్ణుండనని వ్యాపించియున్నవాఁడనని, పాపములహరించువాడనని, వైకుంఠవాసుఁడనని,సూర్యుఁడనని, చంద్రుఁడనని, విష్ణుఁడనని, ఈశ్వరుఁడని పత్యక్స్వరూపుఁడనని,యోగీశ్వరుఁడనని ధ్యేయుడఁనని, అందరికంటె నుత్తముఁడనని, ప్రపంచస్వరూపుఁడనని, అనంతుఁడనని, నాయందుఁ బదు నలుగురింద్రులు కలరనియు నన్నుఁ దెలిసుకొనుమా!

శ్లో॥ వసవోద్వాదశాదిత్యా రుద్రాఏకాదశాస్మృతాః। సప్తర్షయస్సముద్రాశ్చ పర్వతాస్సరితోద్రుమాః॥ నక్షత్రాణిదిశోభూమిః పాతాళంభూర్భువాదికం। మాకురుష్వాత్రసందేహం సోఽహంపార్థ నసంశయః॥

తా॥ ఓధర్మరాజా! అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, సప్తర్షులు, చతుస్సముద్రములు, పర్వతములు, నదులు మొదలువృక్షములు, నక్షత్రములు, దిక్కులు, భూమియు,పాతాళాద్య

ధోలోకములును, భూమ్యాద్యూర్ధ్వలోకములును, నాయందుఁగల వనియు గుర్తెరింగుము, సందేహములేదు.

యుధిష్ఠరః॥ శ్లో॥ అనంతవ్రితమహాత్మ్యం విధింవిధివిదాంవర। కింపుణ్యంకిం ఫలం చాస్యస్యానుష్ఠానవతాంనృణాం ॥ కేనచాదౌపురాచీర్ణం మర్త్యలోకేప్రికాశితం। ఏవం విస్తరం బ్రూహిఅనంతస్యవ్రతంహరే

తా॥ వ్రితవిధులను గుర్తెరింగినవారిలోశ్రేష్టుఁడవగునోకృష్ణా! అనంవ్రితప్రిభావమును, బిధానమును ఈవ్రితమును, జేసినవారి కేమి పుణ్యముగాని ఫలముగాని సంభవించునోచెప్పుము. పూర్వము ముందుగా నాచరించి యెవఁరు భూలోకంబునఁ బ్రికటింపఁజేసిరి. కాబట్టి యీవ్రితముయొక్క యదార్థ్యమునంతయుఁ జెప్పుమని ధర్మరాజు కృష్ణమూర్తి నడిగెను.

కృష్ణః॥శ్లో॥ ఆసీత్పురాకృతయుగే సుమంతుర్నామనైద్విజః। వసిష్ఠగోత్రిసంభూతాం సురూపంచ భృగోస్సుతాం॥ దీక్షానామ్నీం చోపయేమే వేదోక్త విధినానృప॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు. ఓధర్మరాజా! పూర్వము కృతయుగమందు సుమంతుడను పేరుగల బ్రాహ్మణుఁడు కలఁడు. ఆయన వసిష్టునికులమందుఁ బుట్టినదియు జక్కనిరూపముగలదియు భృగునికుమార్తెయునగు 'దీక్ష' యను పేరుగల చిన్నదానిని వేదోక్త ప్రకారంబుగాఁ బెండ్లిచేసుకొనియెను.

శ్లో॥ తస్యాః కాలేన సంజాతా దుహితానంతలక్షణా।
శీలానామ్నా సుశీలావా వవృధేపితృవేశ్మని॥

తా॥ 'దీక్ష' యనెడి యాచిన్నదానికిఁ గొంతగాలమునకనసేక మైన శుభలక్షణములుగలదియు, మంచిస్వభావము గలదియునగు శీల యను కన్యకజనించి తండ్రిగృహమందు వృద్ధిబొందుచుండెను.

శ్లో॥ మాతాచతస్యాః కాలేన జ్వరదాహేనపీడితా। వినష్టాఽ నదీతోయే యయా స్వర్గం పతివ్రితా॥

తా॥ ఆశీలయొక్క తల్లియుఁ బతివ్రతయునై నదీక్షకొంతకాల మునకు జ్వరతాపముచేఁ బీడింపఁబడి శుష్కించి నదీజలంబులోఁ బడి స్వర్గంబుఁజెందెను.

శ్లో॥ సుమంతస్తుతతోఽన్యాం వై ధర్మనున్నసుతాంపునః
ఉపయేమేస వై కన్యాం దుశ్శీలాం నామనామతః

తా॥ అనంతరము సుమంతుఁడు ధర్మనున్నుఁడను రాజుయొక్క కుమారికయు, దుశ్శీలయను పేరుఁగలదియు నగు యొక కన్యకను దిరిగి పెండ్లి చేసుకొనియెను.

శ్లో॥ దుశ్శీలాం కర్కశాం చండీం నిత్యంకలహకారిణీం ।
సాపి శీలాపితుర్గేహే గృహార్చనపరాభభౌ॥

తా॥ ఆ దుశ్శీల కఠినమైనదియు, క్రోధస్వభావముగలదియు నిత్యము పోట్లాడునదియైయుండెను. ఆయనకుమారికయగు ఆ శీలయను కన్యక గృహకృత్యములను జక్కబెట్టుచుఁ దండ్రియొక్క గృహ మందుండె—

శ్లో॥ కుడ్యస్తంభ బహిర్ద్వార గేహళీతోరణాదిషు। వర్ణైశ్చిత్ర మకరోన్నీలపీతైస్సితాసితైః॥ స్వస్తికైశ్శంఖపద్మైశ్చ అర్చయంతీ పునఃపునః॥

తా॥ గోడలయందును, స్థంభములయందును, వెలుపలనుండు ద్వారములయందును, గడపలయందును, తోరణములు మొదలగువాని యందును నలుపు పసుపు తెలుపు ఎఱుపు మొదలగు ననేకరంగులచే స్వస్తికశంఖపద్మాకారములుగా మాటిమాటికి నలంకరించుచుండెను.

శ్లో॥ తతఃకాలేబహుగతే రోహిణీవశవర్తినీ। ఏవంసావర్థతే శీలా పితృవేశ్మనియత్నతః॥

తా! అనంతర మీప్రకారము కొంతకాలముగడచిపోఁగా నాశీలయను చిన్నది లోహిణియను స్త్రీచేఁ బ్రియత్నముతోఁబోషింప బడుచుఁదండ్రియొక్క గృహమందుండి వృద్ధిపొందుచుండెను.

శ్లో॥ తాంద్రుష్ట్వాచింతయామాసనరా ననుగుణాకభువి। కస్మై దేయామయాకన్యా విచార్యేతి సుదుఃఖితః॥

తా॥ అం నంటికుమారిక వాచి తండ్రియగు సుమంతుఁడు వచి జ్ఞానికిఁ దగినవరులను విచారింపుచుఁ దగువరుఁడు సంభవింపక పోవుటచే దుఃఖపడుచు నెవరికి నా కుమారిక నిత్తునని చింతించు చుండెను.

శ్లో॥ ఏతస్మిన్నేవకాలేతు మునిర్వేదవిదాంవరః। కన్యార్థీ చాగత శ్శ్రీమాన్ కౌండిన్యోమునిసత్తమః ॥ ఉనాచరూపసంపన్నాం త్వదీయాంతనయాంవృణే॥

తా॥ ఇట్టిసమయంబున వేదముచదివినవారిలో శ్రేష్ఠుండును శోభాయుక్తుండునగు కౌండిన్యమహాముని శీలను వివాహముచేసికొనఁ దలఁచివచ్చి సౌందర్యముగల నీ కుమార్తెను గోరితినని సుమంతునితో ననియెను.

శ్లో॥ పితాదద్దౌ ద్విజేంద్రాయ కౌండిన్యాయ శుభేదినే।
గృహ్యోక్తవిధినా పార్థ వివాహ మకరోత్తదా॥

తా॥ ఓధర్మరాజా! తండ్రియగు సుమంతుఁడు బ్రాహ్మణో త్తముఁడగు కౌండిన్యమహామునికిఁ దన కుమారికనిచ్చి యప్పుడు గృహ్యసూత్రానుసారముగా వివాహముచేసెను.

శ్లో॥ మంగళాచార నిర్ఘోషం తత్ర కుర్వంతి యోషితః। బ్రాహ్మణాస్స్వస్తివచనం జనఘోషం దవంధినః॥

తా॥ ఆసమయంబునఁ బుణ్యాంగనలు శోభస్కరమైన పాటలను బాడిరి బ్రాహ్మణులు ఆశీర్వచనముల నొసంగిరి, స్తోత్రపాఠకులు స్తుతులను జేసిరి.

శ్లో॥ నిర్వర్త్యోద్వాహికం సర్వంప్రోక్తవాన్ కర్కశాం ద్విజః। కించిద్దాయాదికం దేయం జామాతుః పారితోషికం॥

తా॥ ఈప్రకారము వివాహమును సంపూర్తిచేసి సుమంతుఁడు అల్లునకుఁగొంచెము ధనము నరణముగాను బహుమతిగా నియ్యవలయుఁగానఁ గొంతసొమ్ము నిమ్మని తనభార్యయగు కర్కశనడిగెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాకర్కశాకుద్ధా ప్రోత్సార్య గృహమండనం।

పేటికేమస్థిరంబధ్వా గృహం భోగమ్యతామితి ॥ ఉవాచ విత్తం నైవాస్తిగృహేపశ్యయదిస్థితం॥

తా॥ ఆ ప్రకారముచెప్పిన సుమంతుని వాక్యమును విని భార్యయగు కర్కశి కోపముగలదియగుచు వివాహసంబంధమైన యలంకారమును శిథిలముచేసి ధనమును బెట్టెయందుంచి తాళమువేసిబిగించి ఇంటిలో ధనములేదు. ఇంటిలోనికివెళ్ళిచూచి యేమైననున్నయెడలఁ దీసికొనివెళ్ళుమని రోషముతోఁ బలికెను.

శ్లో॥ శ్రుత్వావిమనాః పార్థ సంయతాత్మామునిస్తదా। భోజ్యావశిష్టచూర్ణేన పాథేయంనైచకారసః॥

తా॥ ఓ ధర్మరాజా! ఈ ప్రకారము కర్కశిపలికిన మాటలను సుమంతుడు విని మనస్సున వ్యాకులముఁజెంది కొంతసేపటికి నివారణఁ జేసికొనినవాఁడై వివాహమునకు ఖర్చుపడగా భుజింపఁగా మిగిలిన పేలపిండిని మార్గమందాహారముకొఱకునిచ్చెను.

శ్లో॥ కౌండిన్యోఽపి వివాహ్యైనాం పథిగచ్ఛన్ శ్శనైశ్శనైః। శీలాం సుమంతో రాదాయ నవోఢాం గోరథేనహి ॥ దదర్శయమునాం పుణ్యాం తాముత్తీర్య తటేరథం। సంస్థాప్యావశ్యకం కర్తుం తతశ్శిష్యాన్ నియుజ్యవై॥

తా॥ కౌండిన్యమహామునియు సుమంతుని కుమారికను వివాహము చేసికొని నవోఢయైన యాశీలను దీసికొని వృషభంబులఁ బూన్చిన రథముపై నెక్కించుకొని మార్గంబున మెల్లమెల్లఁగా వెళ్ళుచునొకచోట పుణ్యాకరమైన యమునానదినిఁజూచి యా నదిని దాటి యొడ్డున రథమునునిలిపి నిత్యకృత్యములను సంపాదించుటకు శిష్యుల నాజ్ఞాపించెను.

శ్లో॥ మధ్యాహ్నే భోజ్యవేళాయాం సముత్తీర్యసరిత్తటే। దదర్శశీలాసాస్త్రీణాం సమూహం రక్తవాససాం। చతుర్దశ్యామర్చయంతం భక్త్యాదేవం జనార్దనం। ఉపగమ్యశనైశ్శీలా పప్రచ్ఛస్త్రీకదంబకం॥

తా॥ ఈ ప్రకారము మధ్యాహ్నము భోజనము వేళయందు

నదియొడ్డునకు వెళ్ళఁగా నావలితీరంబున నెఱ్ఱనివస్త్రములను ధరించిన వారును చతుర్దశియందు విష్ణుమూర్తిని భక్తిచే పూజించుచున్న వారు నైన స్త్రీలయొక్క సముదాయమును ఆశీలచూచి మెల్లగా వారివద్దకు వెళ్ళి యా స్త్రీల నిట్లడిగెను.

శ్లో॥ ఆర్యాః కిమేతస్మే బ్రూత కిన్నామ వ్రత మీదృశం। తాఊచుః యోషితస్తాంతు శీలాంశీలవిభూషణాం॥ అనంతవ్రతమేతద్ధి వ్రతేఽనంతస్తుపూజ్యతే॥

తా॥ ఓ నారీమణులారా! పూజనీయులారా! మీరుచేయు వ్రతమెద్దియో నాకుఁ జెప్పుఁడని మంచిస్వభావమే యలంకారముగాఁ గల యాశీల యడుగఁగా నిది యనంతవ్రతము. ఈవ్రతమందు ననంతుఁడు పూజింపఁబడును, అని యా స్త్రీలామెతోఁ జెప్పిరి.

శ్లో॥ సాబ్రవీ దహమప్యేతత్కరిష్యే వ్రతముత్తమం। విధానం కీదృశం తత్వాకిం దానం కోఽత్ర పూజ్యతే॥

తా॥ ఆస్త్రీలు చెప్పినమాటలను ఆశీల విని నేనును శ్రేష్ఠంబయిన యీవ్రతమాచరించెదను. ఈవ్రతమును జేయు విధానమెట్టిది? ఈవ్రతమందేమిదానము చేయవలయును? దీనియందుఁబూజింపఁబడఁదగినవాఁడెవఁడు? అని శీల ప్రశ్న చేసెను.

స్త్రియః॥ శ్లో॥ శీలేసదన్నం ప్రస్థస్య పున్నామ్నా సంస్కృతస్యచ। అర్ధం విప్రాయ దాతవ్య మర్ధమాత్మనిభోజనమ్॥

తా॥ స్త్రీలు చెప్పుచున్నారు. ఓశీలా! కుంచెడు పరిమాణపు పదార్థముకలఁదియు పురుషునిచేఁ బక్వముఁ జేయఁబడినదియు నగు మంచి యన్నములో సగము బ్రాహ్మణునకిచ్చి సగము (దాను) దన వారును భుజింపవలయును.

శ్లో॥ శక్త్యా చదక్షిణాందద్యాద్విత్త శాఠ్యవివర్జితః। కర్తవ్యం తత్సరిత్తీరే కథాం స్మృత్వా హరే రిమామ్॥

తా॥ తనశక్తిననుసరించి ద్రవ్యలోపముఁ జేయక దక్షిణ నిచ్చి విష్ణుయొక్క కథను విని పూర్వమునఁ జెప్పినట్లు నదీతీరమందు వ్రతమును జేయవలయును.

శ్లో॥ శేషం కుశమయంకృత్వా వంశపాత్రే నిధాపుచ। స్నాత్వానంతం సమభ్యర్చ్య మండలే గంధదీపకైః॥ పుష్పైః ధూపైశ్చ నైవేద్యైర్నానాపక్వాన్న సంయుతైః॥

తా॥ దర్భలతో నాదిశేషుని నిర్మించి వెదురుపాత్రియందుంచి స్నానముచేసి యా పాత్రిను మండపమందుంచి గంధము ధూపము దీపము పుష్పములు మొదలగువానిచే బూజించి యనేకభక్ష్యములు పరమాన్నము మొదలగువానిని నివేదనము చేయవలయును.

శ్లో॥ తస్యాగ్రతో దృఢం సూత్రం కుంకుమాక్తం సుదోరకం। చతుర్దశగ్రంథియుత మేవం కరతలేన్య సేత్।

తా॥ ఆయనంతునకు ముందు దృఢమయినదియు కుంకుమచేఁ బూయఁబడి పదునాలుగు ముడులు వేయబడిన తోరమును హస్తమందుంచవలయును.

శ్లో॥ అనంత సంసారమహాసముద్రే మగ్నం సమభ్యుద్ధర వాసుదేవ। అనంతరూపోఽసిదయాసముద్రో హ్యనంతరూపాయ నమోనమస్తే॥

తా॥ ఓ అనంతుఁడా! సంసారసముద్రములో మునిగిన నన్ను దరికిఁ జేర్చుమా. ఓ వాసుదేవా! నీవనేకమైన స్వరూపములు గలవాఁడవును దయాసముద్రుడవు నయి యున్నావు. అనంతస్వరూపుఁడవైన నీకు నమస్కారము చేసెదను.

శ్లో॥ అనంతంచ కరేబధ్వా భోక్తవ్యం సస్థమానసైః। ధ్యాత్వానారాయణం దేవమనంతం విశ్వరూపిణం॥ భుక్త్వాచాంతేవ్రజే ద్వేశ్మభద్రేప్రోక్తం వ్రతంతవ॥

తా॥ ఈ ప్రకారమనంతుని ధ్యానించి హస్తమందు దోరమును గట్టుకొని ప్రపంచ స్వరూపుఁడును అనంతుండు నగు నారాయణుని ధ్యానించి స్థిరచిత్తముగలవారలై భోజనము చేసి పిమ్మట నింటికి వెళ్ళవలయును. కాఁబట్టి ఓమంగళప్రదులారా! నీకీవ్రతవిధానమును జెప్పితిమి.

శ్లో॥ ఏవమాకర్ణ్య రాజేంద్రప్రహృష్టే నాంతరాత్మనా। సాపి

చక్రేవ్రతం శీలాకరే బధ్వాసుదోరకం ॥ చతుర్దశగ్రంథియుతంవామే బాహౌయథోదితమ్॥

తా॥ ఓ ధర్మరాజా! ఆప్రకారమాస్త్రీలు చెప్పినవాక్యములను విని యాశీల సంతోషించిన మనసుగలదై యనంతవ్రత మాచరించి శాస్త్రమందుఁ జెప్పిన ప్రకారముగా బదునాలుగు ముడులు వేయఁ బడినదోరము నెడమచేతియందుఁ గట్టుకొనెను

శ్లో॥ పాథేయమర్ధం విప్రాయ దత్వా భుక్త్వా స్వయం తతః। పురం జగామ సంప్రహృష్టా గోరథేన స్వకం గృహం॥ భర్త్రాసహైవ శనకైః ప్రీత్యయా స్తత్క్షణా దభూత్॥

తా॥ మార్గమందలి బత్తెమునకుఁ దెచ్చుకొనిన పదార్థములో సగము బ్రాహ్మణునకు వాయనమిచ్చి మిగిలిన సగము తానును భర్తయు ననుభవించి యనంతరము సంతోషముగలది యగుచు వృషభము లనుఁ గట్టిన రథమునెక్కి పెనిమిటితోఁగూడ మెల్లగానింటికి వెళ్ళఁగా నప్పుడే వ్రతఫలమగపడెను.

శ్లో॥ తేనానంతవ్రతేనాస్య బభౌగోధనసంకులం।గృహంశ్రీమం శ్రియాజుష్టం ధనధాన్యసమన్వితం॥ ఆకులం వ్యాకులం రమ్యంసర్వ త్రాతిథిపూజనైః॥

తా॥ ఆయనంతవ్రతమహత్తుచే ఆ బ్రాహ్మణునియొక్కగృహము లక్ష్మిచే విలసిల్లుచుండెను. ధనధాన్యములతోను అంతట నతిథిసత్కార ములతోను నిండి చూచువారల కానందముగా నుండెను.

శ్లో॥ సాపిమాణిక్యకాంచీభిః ముక్తాహారై ర్విభూషితా । దివ్య వస్త్రైస్త్రింసంఛన్నా సావిత్రీప్రతిమాభవత్ ॥

తా॥ ఆ శీలయు మాణిక్యములు కూర్పఁబడిన యొడ్డాణముల చేతను ముత్యాలసరములచేత నలంకరింపఁబడినదియు శ్రేష్ఠంబులగు వస్త్రములచేతను మాలికలచేతను గప్పఁబడినదియునై సావిత్రీదేవితో సమానముగాఁ బ్రకాశించుచుండెను.

శ్లో॥ విచచారగృహేభర్తుః సమీపేతుసురూపిణీ। కదాచిదుప

విష్టాయా దృష్ట్వాబద్ధస్సుదోరకః ॥ శీలాయా హ స్తమూలేతు భర్త్రాత్రి స్యాద్విజన్మనా ॥

తా॥ ఈ ప్రకారము విశేషసంపత్తును జక్కయాకారమునుగల యాశీలగృహమందుఁ బెనిమిటిసమీపముననే తిరుగుచుండెను. అట్లుండఁగా నొకప్పు డా శీల కూర్చుండి యుండగా నామె యెడమచేతియందుఁ గట్టుకోఁబడిన తోరమును ఆమె పెనిమిటియగు కౌండిన్యమునీశ్వరుఁడు చూచెను.

శ్లో॥ కిమిదంతోరకం శీలే మమవశ్యాయకల్పితం । ధృతంతు తోరకంత్వేత త్క్రమర్థం బ్రూహితత్వతః ॥

తా॥ ఓ శీలా! నీచేతియందుఁ దోరము నెందునిమిత్తము కట్టితివి? నన్ను స్వాధీనము చేసికొనఁదలఁచి కట్టుకొంటివా యేమి సత్యముగా దీనివృత్తాంతమును జెప్పుమని పెనిమిటి యడిగెను.

శీలా॥ శ్లో॥ యస్యప్రసాదాత్సకలా ధనధాన్యాదిసంపదః। లభ్యంతే మానవైశ్చాపి సోఽనంతోఽయం మయాధృతః ॥

తా॥ ఓ స్వామీ! ఏ భగవంతుని యనుగ్రహమువలన ధనము ధాన్యము మొదలగు సంపత్తులను మనుష్యులు పొందెదరో యటువంటి భగవంతుఁడగు ననంతునిసంబంధమైన తోరమునుగట్టితినని శీలచెప్పెను

శ్లో॥ శీలాయాస్తు వచశ్శ్రుత్వా భర్త్రాతేన ద్విజన్మనా। కిమిదంతోరకంశీలే మమవశ్యాయ కల్పితం॥ శ్రీమదాంధేన కౌండిన్య స్సాక్షేపం త్రుటిత స్తదా। కోఽనంత ఇతి మూఢేన జల్పతాపాపకారిణా ॥ క్షిప్తోజ్వాలాకులేవహ్నౌ హాహాకృత్వా ప్రధావతీ। శీలాగృహీత్వా తత్సూత్రం క్షీరమధ్యే సమాక్షిపత్ ॥

తా॥ ఈ ప్రకారము శీలచెప్పిన మాటలను విని పెనిమిటియైన యా బ్రాహ్మణుఁడు కాదు నన్ను స్వాధీనముచేసికొన దలఁచి కట్టుకొంటివని యైశ్వర్యమదముచేఁ గన్నుమిన్నుగానక యప్పుడు శీలహస్తమందుండు తోరము బలాత్కారముగాఁ ద్రెంచి యనంతుడనఁగా నెవ్వడని యాక్షేపణపూర్వకముగాఁ బ్రేలుచు మూఢుఁడును బాపాత్ముండైన యా బ్రాహ్మణుఁడు మండుచున్న యగ్నియందుఁ దోరమునుం

చఁగా వెనుక శీల యేడ్చుచుఁ బరుగెత్తుకొని వచ్చి యాదోరమును దీసి పాలలోనుంచెను.

శ్లో॥ తేనకర్మవిపాకేన సాక్షీ స్తస్యక్షయంగతా। గోధనంతస్కరైర్నీతం గృహందగ్ధం ధనంగతమ్ ॥ యద్యదేవాగతంగేహే తత్తదైవ పునర్గతమ్ ॥

తా॥ దోరము నగ్నియందుంచుట యను పాపకర్మముచే ఆ కౌండిన్యమహామునియొక్క సంపత్తు తత్క్షణమే నశించిపోయెను. పశువులను దొంగలు తోలుకొని వెళ్ళిరి. ధనముతోనిండినగృహము దగ్ధమయినది. ఏకొంచమయినను గృహమునకుఁ దెచ్చిరేని అది తత్క్షణమే వెడలిపోయెను.

శ్లో॥ స్వజనైః కలహోనిత్యం బంధుస్తాడనంతథా। సంతాక్షేప దోషేణ దారిద్ర్యం పతితంగృహే ॥

తా॥ స్వకీయమయినవారితో నిత్యము పోటాడుటయు బంధువులచేఁ గొట్టఁబడుచుండుటయు దారిద్ర్యంచే గృహం నిండియుండుటయు అనంతుని దూషించుట యను దోషమువలన సంభవించెను.

శ్లో॥ నకశ్చిద్వదతేలోకే తేనసార్థంయుధిష్ఠిర। శరీరేణాఽతి సంతప్తో మనసాప్యతిదుఃఖితః ॥ నిర్వేదం పరమం ప్రాప్తః కౌండిన్యః ప్రాహతాంప్రియామ్ ॥

తా॥ ఓ ధర్మరాజా! ఆయనతో నొకఁడైనను ప్రపంచంలో మాటలాడఁడయ్యెను. శరీరమందుఁ దాపముసంభవించెను. మనస్సునందు విశేషంగా దుఃఖపడుచుండెను. ఈరీతి ననేకమయిన దుఃఖములను బొంది తుదకు విశేషమయిన పశ్చాత్తాపమును జెంది కౌండిన్యమహాముని తన భార్యతో నిట్లుపలికెను.

కౌండిన్యః॥ శ్లో॥ శీలేమమేద ముత్పన్నం సహసా శోకకారణం। యేనాఽతిదుఃఖదోఽస్మాకం జాతస్సర్వధనక్షయః ॥

తా॥ ఓశీలా! దేనివలన సమస్తధననాశనమును మనకుమిక్కిలి దుఃఖమును సంభవించెనో యట్టి దుఃఖహేతువు మనకెందువలన శీఘ్రముగా కలిగెనో తెలిసికొంటివా?

శ్లో॥ స్వజనైఃకలహోగేహే న కశ్చిన్మాంపరిభాషతే । శరీరే నిత్యసంతాపః ఖేదశ్చేతసి దారుణః ॥ జానాసిదుర్నయఃకోఽత్ర కిం కృత్వాసుకృతం లభేత్ ॥

తా॥ ఇంటిలో స్వజనముతో నిత్యము కలహంజరుగుచుండెను. ఒకఁడైనను నాతో మాటలాడఁడు, శరీరమందుఁ దాపము సంభవించెను. మనస్సునకు విశేషమైన దుఃఖము కలిగెను. కాఁబట్టి యిటువంటి కష్టము కలుగుటకు గారణమేదియైయుండును ఏమిచేసిన దుఃఖనివృత్తి కలిగిపుణ్యము సంభవించునో చెప్పుమని కౌండిన్యమహాముని తనభార్య యగు శీల నడిగెను.

శ్లో॥ ప్రత్యువాచాథతంశీలా సుశీలా శీలమండనా ॥ ప్రాప్తానంత కృతాక్షేప పాపసంభవతఃఫలమ్ ॥ దుస్సహంయ న్మహాభాగ తచ్ఛాంతౌ యత్నమాచర ॥

తా॥ ఇట్లు పెనిమిటి యడుగఁగా మంచిస్వభావము గలదియై మంచి గుణమే యలంకారముగా గల యా శీల యిట్లు చెప్పెను. ఓ స్వామీ! అనంతుని ఆక్షేపణచేయుటవలన నిట్టి కఠినమైన దుఃఖము సంభ కాఁబట్టి యా పాపము పోవుటకొఱకుఁ బ్రయత్నము చేయుఁడు.

శ్లో॥ ఏవముక్తస్స దేవర్షి ర్జగామ మనసాహరిం నిర్వేదంనిర్జగామాఽథ కౌండిన్యః ప్రియయోవనమ్ ॥

తా॥ ఈ ప్రకారము భార్య చెప్పిన మాటలను విని దేవముని యగు వా కౌండిన్యుఁడు పశ్చాత్తాపమును బొంది మనస్సున విష్ణుమూర్తిని ధ్యానించుచు వనమునకు వెళ్ళెను.

శ్లో॥ తపసేకృతసంకల్పో వాయుభక్షో ద్విజోత్తమః। ధ్యాయన్ననంతంమనసా క్వద్రక్ష్యామిచ తద్విభుమ్ ॥

తా॥ ఆ బ్రాహ్మణోత్తముఁడు తపస్సుచేయుట కొఱకు సంకల్పము గలవాఁడై, ఆ భగవంతుని నెక్కడఁ జూతునని మనస్సున ననంతుని స్మరింపుచుండెను.

శ్లో॥ యస్యప్రసాదాత్సంజాత మాక్షేపాన్నిధనం గతమ్ । ధనా

ధికం మహాతీవ సుఖదుఃఖప్రదాయకమ్ ॥ ఏవంసంచింతయనోऽథ బభ్రామ విజనేవనే॥

తా॥ ఎవనియొక్క యనుగ్రహమువలన ధనము మొదలగునవి సంభవించెనో యెవని నాక్షేపించుటవలన నశించెనో యిట్లు మిక్కిలి సుఖదుఃఖముల నిచ్చెడి యీ భగవంతుని నెచ్చటఁజూతునని విచారించుచు నా కౌండిన్య మునీశ్వరుఁడు జనరహితమైన యీ యడవి యందుఁ దిరుగుచుండెను.

శ్లో॥ తత్రాపశ్య న్మహాచూతం పుష్పితం ఫలితం ద్రుమమ్ । వర్జితం పక్షిసంఘాతైః కీటకోటీసమావృతమ్ ॥

తా॥ ఆ వనమునందుఁ బుష్పించినదియు, ఫలించినదియుఁ, బక్షులు మొదలగువానిచే విడిచిపెట్టఁ బడినదియు, పురుగులు మొదవానిచే నావరింపఁబడినదియు నగు నొక గొప్ప మామిడివృక్షమును జూచెను.

శ్లో॥ తమపృచ్ఛద్ద్విజోఽనంతః క్వచిదృష్టోమహాత్వయా । బ్రూహిసౌమ్య మమాతీవ దుఃఖంచేతసివర్తతే ॥

తా॥ ఓ వృక్షమా! మహానుభావుండగు ననంతుని నెచ్చటనయినను జూచితివేనిఁ జెప్పుమా. నా మనస్సునవిశేష దుఃఖము గలిగినది' అని బ్రాహ్మణుఁడావృక్షమునడిగెను.

శ్లో॥ సోఽబ్రవీద్భద్రనానంతః క్వచిద్దృష్టోమయాద్విజ। ఏవం నిరాకృతస్తేన సంజగామాऽథదుఃఖితః॥

తా॥ ఆబ్రాహ్మణుండిట్లడుగఁగా నో బ్రాహ్మణుఁడా! అనంతుని నెచ్చటను నేఁజూడలేదు, అని వృక్షము నిరాకరించి పలుకఁగా నా బ్రాహ్మణుఁడు దుఃఖించి యచ్చటనుండి మఱియొక చోటున కరిగెను.

శ్లో॥ క్వచిద్రాత్వ్యామితిగచ్ఛన్ గాందదర్శ సవత్సకాం।వనమధ్యే ప్రధావంత మితశ్చేతశ్చపాండవ॥

తా॥ ఓ ధర్మరాజా! ఆ బ్రాహ్మణుఁడు భగవంతు నెక్కడఁ

జూతు ననుకొని వెళ్ళుచుండఁగా వనమధ్యమం దిటు నటు పరుగెత్తుచు దూడతోఁ గూడియుండిన యొక యావును జూచెను.

శ్లో॥ సోఽబ్రవీ ద్ధేనుకే బ్రూహియద్యనంత స్త్వయేక్షితః । గౌరు వాచాఽథ కౌండిన్యం నానంతం వేద్మ్యహంద్విజ॥

తా॥ ఓ గోవా! అనంతుని జూచితివాయని బ్రాహ్మణుం డడుగఁగా నో బ్రాహ్మణుఁడా! నే ననంతుని నెఱుఁగను అని కౌండిన్యునితో నా యావు పలికెను.

శ్లో॥ తతో వ్రజన్ దదర్శాగ్రే వృషభంశాద్వలేస్థితం । దృష్ట్వా పప్రచ్ఛగోస్వామి న్ననంతో వీక్షిత స్త్వయా॥

తా॥ అనంతరము వెళ్ళుచు ముందు పచ్చిక ప్రదేశమందు మేయుచున్న యొకవృషభమును జూచి యో వృషభరాజమా! అనంతునిఁ జూచితివా, యని యా బ్రాహ్మణుఁడడిగెను.

శ్లో॥ వృషభ స్తమువాచేదం నానంతో వీక్షితో మయా॥

తా॥ ఇట్లు బ్రాహ్మణుఁడడుగగానే ననంతునిఁ జూడలేదని యా బ్రాహ్మణునితో వృషభము పలికెను.

శ్లో॥ తతో వ్రజన్ దదర్శాగ్రే రమ్యం పుష్కరిణీద్వయం । అన్యోన్యజలకల్లోలై ర్వీచీపర్యంతసంగమమ్॥ ఛన్నం కమల కల్హారైః కుముదోత్పలమండితం । సేవితంభ్రమరైః హంసైః చక్రకారండ వై ర్బకైః ॥ తేచాపృచ్ఛద్ద్విజో నంతో యువాభ్యాంకిము వీక్షితః॥

తా॥ ఆ బ్రాహ్మణుం డచ్చటనుండి వెళ్ళుచుఁ బరస్పరము తరంగములచేతఁ గలసికొని ధ్వని చేయుచున్నవియుఁ బద్మములచే తను గప్పబడినవియుఁ దెల్లనల్లఁ గలువలచే నలంకరింపఁబడినవియుఁ దుమ్మెదలు హంసలు చక్రవాకములు పక్షులు కొంగలు మొదలగు వానిచే సేవింపఁబడినవియు నగు రెండుకొలఁకులను చూచి యా బ్రాహ్మణుఁడు మీరనంతుని చూచితిరా యని యాసరస్సుల నడిగెను.

శ్లో॥ తేప్రత్యూచతు రావాభ్యాం నానంతో వీక్షితః క్వచిత్ తథోచతుః ఖరశ్చైవ కుంజరశ్చ యుధిష్ఠిర॥

తా॥ ఓధర్మరాజా! ఎక్కడను మేముచూడలేదని ఆసరస్సులు

చెప్పినవి. అనంతరమీరీతి మార్గములోనున్న గాడిదను ఏనుఁగును అడుగఁగా నవియు నటులేచెప్పినవి.

శ్లో॥ ఏవంసపృచ్ఛన్నష్టా శ్రుత్వాతైవనిమసాదహ । కౌండినోహ్య విహ్వలీభూతో నిరాశోజీవితేనృప॥ దీర్ఘముష్ణంచ నిశ్వస్య పపాతభువి భారత ॥

తా॥ భారతకులంబునఁబుట్టిన యోధర్మరాజా! ఆకౌండిన్యుం డిట్లు మార్గంబునఁ బ్రతిజంతువునడుగుటయు నవి తనకిష్టమగును త్తర మును జెప్పకపోవుటయుఁ జూచి భగవంతుడు కనుపింపఁడని నిరాశ చేసికొని యక్కడనే కూర్చుండి వ్యాకులమనస్కుడై తన ప్రాణమం దలి యాశవదలి దుఃఖముచే విశేషమైన వెచ్చని నిట్టూర్పులు విడు చుచు భూమిమీద మూర్ఛనొందిపడెను.

శ్లో॥ ప్రాప్యసంజ్ఞా మనంతేతి కపన్నుత్థాయసద్విజః । నూనంత్యక్ష్యామ్యహంప్రాణా నితిసంకల్ప్యచేతసి ॥ యావత్సకృతేతు వృక్షేఽ స్మిన్ తావద్భరతసత్తమ । కృపయానంత దేవోపి ప్రత్యక్షం సమ జాయత ॥

తా॥ ఆబ్రాహ్మణుఁడు కొంతసేపటికిఁ దెలివిఁ దెచ్చుకొని "అ నంత, అనంత" యని జపించుచులేచి నిశ్చయముగా నేను ప్రాణము లను విడిచెదనని మనస్సునందు సంకల్పముకలవాఁడై ప్రయత్నము చేయఁగానోధర్మరాజా! యప్పుడనంతుఁడు ఆబ్రాహ్మణునియందుదయ గలవాఁడై యక్కడనుండు వృక్షములోనుంచి ప్రత్యక్షమయ్యెను.

శ్లో॥ వృద్ధబ్రాహ్మణరూపేణ ఇత ఏహీత్యువాచ తం । ప్రగృహ్య దక్షిణంపాణిం గుహాయాం ప్రవివేశచ॥

తా॥ అనంతుఁడు ముసలిబ్రాహ్మణరూపమునుధరించి ఓ బ్రా హ్మణుఁడా! ఇటురమ్మా యని పిలిచి యాయనయొక్క కుడిచేతిని బట్టుకొని పర్వతగుహలోనికిఁ దీసికొని వెళ్లెను.

శ్లో॥ స్వాం పురీం దర్శయామాస దివ్యనారీనరైర్యుతాం। తస్యాం నివిష్టమాత్మానం దివ్యసింహాసనేశుభే ॥ పార్శ్వస్థశంఖచక్రాబ్జ గదా గరుడశోభితం । దర్శయామాస విప్రాయ విశ్వరూపమనంతకం॥

తా॥ అక్కడ దేవతాస్త్రీపురుషులతోఁ గూడియుండిన తన పట్టణమును ఆపట్టణమందు శ్రేష్ఠంబును శోభస్కరమునైన సింహాసనమందుఁ గూర్చుండియున్నవాఁడును ఇరుప్రక్కలను శంఖము చక్రము పద్మము గద గరుత్మంతుఁడు మొదలగువానిచేఁ బ్రకాశించువాఁడునై యనంతమైన తన విశ్వరూపమును ఆ బ్రాహ్మణునికిఁ జూపించెను.

శ్లో॥ విభూతిభేదై శ్చానంతై రనంత ఇతినిశ్చితం। కౌస్తుభేవ విరాజంతం వనమాలావిభూషితం॥

తా॥ కౌస్తుభమణిచేఁ బ్రకాశించువాఁడును వనమాలికచే నలంకరింపఁబడినవాఁడునగు నామహానుభావుని యమితమైన యైశ్వర్యముల జూచి యాయనయే యనంతుడని నిశ్చయించుకొనెను.

శ్లో॥ తం దృష్ట్వా తాదృశం రూప మనంత మపరాజితం। వంద్యమానో జగాదోచ్చైః జయశబ్దపురస్సరం॥

తా॥ అన్నిటిని దిరస్కరించునట్టి యనంతుని రూపముఁజూచి నమస్కరించి జయ జయ అని బిగ్గఱగాఁ బలుకుచు నమస్కరించెను.

శ్లో॥ పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః। త్రాహిమాం పుండరీకాక్ష సర్వపాపహరోభవ॥

తా॥ పద్మములవంటి నేత్రములుగల యోస్వామీ! నేను పాపుఁడను పాపకర్మములనుఁ జేయువాఁడను పాపస్వభావుఁడను, పాపములవలనఁబుట్టినవాఁడను, ఇట్టినన్ను నీవు సమస్తపాపములను నశింపఁజేయువాడవుగాన రక్షింపుము.

శ్లో॥ తచ్ఛ్రుత్వా నంతదేవేశః ప్రాహ సుస్నిగ్ధయాగిరా। మాభైషీస్త్వం బ్రూహి విప్రయత్తే మనసివర్తతే॥

తా॥ ఈప్రకారము పలికిన యా బ్రాహ్మణునివాక్యములు అనంతదేవుఁడు విని మృదువుగా నిట్లుపలికెను. ఓ బ్రాహ్మణుఁడా! నీవు భయపడకుము. నీమనస్సునం దేమి కోరికకలదో చెప్పుమని యనంతుఁడు పలికెను.

కౌండిన్యః॥ శ్లో॥ మయా ప్రాగవలిప్తేన త్రుటితోఽనంతదోరకః। తేన పాపవిపాకేన భూతిర్మే ప్రలయంగతా॥

తా॥ కౌండిన్యుఁడు చెప్పుచున్నాఁడు. పూర్వమందు నేను గర్వముగలవాఁడనై యనంతుని సంబంధమగు తోరమును ద్రెంచితిని. ఆ పాపవిశేషముచే నాసంపత్తంతయు నశించినది.

శ్లో॥ స్వజనైఃకలహోగేహే నకశ్చిన్మాంప్రభాషతే। నిర్వేదాద్భ్రమతోఽరణ్యే తవదర్శనకాంక్షయా ॥ కృపయా దేవదేవేశ త్వయాత్మానం ప్రదర్శితః ॥

తా॥ గృహమందు స్వజనముతోఁ బోట్లాడుట సంభవించుచుండెను. ఒక్కఁడును నాతో మాటలాడుచుండుటయు లేదు. కాన నిటువంటిదుఃఖములను బొంది తుదకుఁ బశ్చాత్తాపము గలిగి నీదర్శనమును గోరి యీయడవిలో సంచరించుచుండఁగా నో దేవదేవా! నాయందు దయకలవాఁడనై నీరూపమును జూపితివి.

శ్లో॥ తస్యపాపస్యమేశాంతిం కారుణ్యాద్వక్తు మర్హసి ॥

తా॥ "అటువంటి నాపాపమేరీతి నశించునో దయగలగి చెప్పుటకుఁ దగినవాఁడవు" అని కౌండిన్యుఁడు అనంతునడిగెను.

కృష్ణః॥ శ్లో॥ తచ్ఛ్రుత్వానంతదేవేశ ఉవాచద్విజసత్తమం। భక్త్యా సంతోషితోదేవః కిం నదద్యా ద్యుధిష్ఠిర ॥

తా॥ ఓ ధర్మరాజా! ఇట్లు బ్రాహ్మణుఁడు చెప్పిన వాక్యము ననంతుఁడు విని బ్రాహ్మణోత్తమునితో నిట్లనెను. ధర్మరాజా! భక్తి వలన భగవంతుఁడు సంతోషించెనేని భక్తునకేమియ్యఁడు? అనఁగా సమస్తము నిచ్చును.

అనంతః॥ శ్లో॥ స్వగృహంగచ్ఛకౌండిన్య మావిలంబం కురుద్విజ। చరానంతవ్రతంభక్త్యా నవవర్షాణి పంచచ ॥

తా॥ అనంతుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణుఁడా! నీవాలస్యముఁజేయక యింటికివెళ్ళి యనంతుని వ్రతము భక్తితోఁ బదునాలుగు సంవత్సరము లాచరింపుము.

శ్లో॥ సర్వపాప విశుద్ధాత్మా ప్రాప్యసే సిద్ధి ముత్తమాం

పుత్రాన్ పౌత్రాన్సముత్పాద్య భుక్త్వాభోగా న్యథేప్సితాన్ ॥ అంతే మత్స్మరణంప్రాప్య మా ముపేష్య స్యసంశయం ॥

తా॥ సమస్తపాపములను బోఁగొట్టుకొని పరిశుద్ధాంతః కరణుఁడవై ఉత్తమమగు సిద్ధిని బొంది పుత్రులను పౌత్రులను బొందినవాడవై నీకోరికల ననుభవించి యంత్యకాలంబున నాస్మరణగలవాఁడవై నన్నుఁ బొందగలవు. సందేహములేదు.

శ్లో॥ అన్యచ్చతేవరం దద్మి సర్వలోకోపకారకం । ఇద మాఖ్యానకవరం శ్రుత్వానంతవ్రతాదికం ॥ కరిష్యతి నరోయస్తు కుర్వన్ వ్రతమిదంశుభం । సోఽచిరాత్పాపనిర్ముక్తః ప్రాప్నోతి పరమాంగతిం ॥ గచ్ఛవిప్రగృహంశీఘ్రం యథాయేనాఽగతోహ్యసి॥

తా॥ ఇతరమైన వరమొకటి నీకిచ్చుచున్నాను. ఈ శ్రేష్ఠంబగు కథ నెవఁడు విని శుభముల నొసగెడి యీయనంతవ్రతమును జేయునో యటువంటి పురుషుఁడు శీఘ్రముగాఁ బాపముల నుండి విముక్తుఁడై శ్రేష్ఠంబగు నా స్థానమును బొందగలఁడు. ఓ బ్రాహ్మణుఁడా నీవే విధంబుగా నేమార్గంబున వచ్చితివో యా మార్గంబున శీఘ్రంబుగా నీ యింటికి నేగుము.

కౌండిన్యః॥ శ్లో॥ స్వామిన్ పృచ్ఛామిమే బ్రూహి కించి త్కౌతూహలం మయా । అరణ్యే భ్రమతా దృష్టం తద్వదస్వ జగద్గురో ॥

తా॥ కౌండిన్యుఁ డడుగుచున్నాఁడు. ఓ స్వామీ! నాకుఁ గొంచెము కోరిక యున్నది. దానిని జెప్పవలయును. ప్రపంచమునకు గురువా! నే నరణ్యమందుఁ జూచిన సంగతిని విమర్శించి చెప్పవలెను.

శ్లో॥ యశ్చూతవృక్షక స్తత్ర కాగాః కోవృషభస్మృతః । కమలోత్పలకల్హారశోభితం సుమనోహరం॥మయాదృష్టం మహారణ్యే కించిత్పుష్కరిణీద్వయం।కః ఖరః కుంజరః కోవా కోఽ సౌవృద్ధోద్విజోత్తమః॥

తా॥ ఓస్వామీ! నేనరణ్యమందుఁ గొన్నిటిని జూచితిని వానిలో మామిడివృక్షమనఁగా నెటువంటిది. గోవనఁగా నేది? వృషభమనఁగా నెవరు? పద్మములచేతను నల్లఁగలువల చేతను ఎఱ్ఱఁగలువల

చేతను ప్రకాశించునవియు మనోహరములు నైనరెండు సరస్సులను జూచితిని వానిసంగతియేమి? గాడ్దెభమనఁగా నెవరు? ఏనుఁగన నెవ్వరు? ఆ ముసలి బ్రాహ్మణుండెవరు? వీరి యాథార్థ్యమును జెప్పు మని కౌండిన్యుఁ డనంతునడిగెను.

అనంతః॥శ్లో॥ స చూతవృక్షో విప్రోऽసౌ వేదవిద్యావిశారదః। విద్యానదత్తా శిష్యేభ్యస్తేనాసౌ తరుతాం గతః॥

తా॥ అనంతుఁడు చెప్పుచున్నాఁడు ఆమామిడిచెట్టెవరనఁగా నొకబ్రాహ్మణుఁడు. ఆయన సమస్తవేదశాస్త్రములను జదివి శిష్యులు కోరినను వారికి విద్యఁ జెప్పక పోవుటచే వృక్షముగా జన్మించెను.

శ్లో॥ యా గౌ ర్వసుంధరా దృష్టాపూర్వం సా బీజహారిణీ। వృషోధర్మ్మక్రయీ దృష్ట స్తూష్ణీం శాద్వల మాశ్రితః॥

తా॥ పూర్వమందు వి త్తనములను హరించిన భూదేవిగా నా యావు చెప్పఁబడును. ధనము గ్రహించి ధర్మ్మములను జెప్పిన బ్రాహ్మణుండు వృషభమైవచ్చి గడ్డికల ప్రదేశమందుండెను.

శ్లో॥ ధర్మ్మాధర్మ్మ వ్యవస్థానం తచ్చ పుష్కరిణీద్వయం।బ్రాహ్మణ్యౌ కేచిద ప్యాస్తాం భగిన్యౌ తే పరస్పరం॥ ధర్మ్మాధర్మ్మాది యత్కించిత్సన్ని వేదయతో మిథః। విప్రాయ వేదవిదుషే నదత్తం బుర్బలాయవై॥ భిక్షాదత్తా నచార్థిభ్యస్తేనపాపేన కర్మ్మణా। వీచీకల్లోలమాలాభిర్గచ్ఛత స్తే పరస్పరం॥

తా॥ ఆసరస్సులు రెండును ధర్మ్మాధర్మ్మ నిర్థారణచేయునిద్ద అక్కచెల్లెండ్రగు బ్రాహ్మణస్త్రీలు. తనలోఁ దామేదోకొంచెముగా ధర్మ్మాధర్మ్మములను జెప్పుకొనుచు వేదము చదివిన బ్రాహ్మణునకుఁగాని దీనునకుఁగాని మఱియేయితర యాచకులకుగాను భిక్షను బెట్టినవారు కాకపోయిరి. ఆ పాపవిశేషముచేఁ గొలకులుగా నవతరించి తరంగ పంక్తులచే బరస్పరము కలసికొనుచుండిరి.

శ్లో॥ ఖరః క్రోధ స్తథా దృష్టః కుంజరో మద ఉచ్యతే।బ్రాహ్మణోऽసౌ వనంతో ऽహం గుహా సంసారగహ్వరం॥

తా॥ గాడ్దెభము క్రోధముగాను ఏనుఁగుమదముగాను జెప్పఁ

బడియె. ఆబ్రాహ్మణుఁడు అనంత స్వరూపుండ నగునేను. పర్వతగుహ యనఁగా సంసార గుహ యని యెఱుంగుము.

శ్లో॥ ఇత్యుక్త్వా దేవదేవేశ స్తత్రై వాంత రధీయత।స్వప్నప్రాయం తతోదృష్ట్వాతత స్స్వగృహమాగతః॥ కృత్వానంతవ్రతం సమ్యగ్దశవర్షాణిపంచచ। భుక్త్వా సర్వ మనంతేనయథోక్తం పాండునందన॥అంతేచస్మరణం ప్రాప్యగతోఽనంతపురంద్విజః॥

తా॥ ఓధర్మరాజా! దేవదేవుండనగు ననంతుఁడిట్లు చెప్పి యంతర్థానమయ్యెను. అనంతర మాబ్రాహ్మణుఁ డప్పుడు జరిగినవృత్తాంతమంతేయు స్వప్నవృత్తాంతముగాదలంచి తనయింటికి వెళ్ళి యనంతుని వ్రతము చక్కఁగా బదునాలుగు సంవత్సరములు ఆచరించి యనంతుని యనుగ్రహామువలన సమస్తమైన సుఖముల ననుభవించి యంత్యకాలంబున భగవన్నామస్మరణగలవాఁడై యాబ్రాహ్మణుడు వైకుంఠ పదవి జేరెను.

శ్లో॥తథా త్వమపి రాజర్షే కథాంశ్రుత్వా వ్రతంకురు।ప్రాప్యసే చింతితం సర్వ మనంతస్య వచో యథా॥

తా॥ రాజర్షి వగునోధర్మరాజా! నీవును గథను విని యా బ్రాహ్మణుండాచరించినరీతిగా వ్రతమునుచేయుము. అందువల్ల ననంతుని వాక్యప్రకారముగా నీవు కోరినదంతయు బొందగలవు.

శ్లో॥ యద్వాచ్చతుర్దశే వర్షేఫలం ప్రాప్తం ద్విజన్మనా। ఏకవర్షే తథాప్నోతిశ్రుత్వోపాఖ్యానకవ్రతం॥

తా॥ బ్రాహ్మణుఁడు పదునాలుగు సంవత్సరములయందు ననంతవ్రతముచేసి యేఫలమును బొందెనో యటువంటిఫలము నరణ్యమందు బ్రాహ్మణునకు భగవంతునకు జరిగిన యుపాఖ్యానమును విని యొక సంవత్సరములోనే వ్రతఫలము పొందగలడు.

శ్లో॥ ఏత త్తేకథితం భూపవ్రతానా ముత్తమంవ్రతం। యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాత్రసంశయః॥

తా॥ ఓరాజా! ఏవ్రతమునుచేసి మనుష్యుఁడు సమస్తపాపముల

వల్లను విముక్తుఁడగునో వ్రతములలో శ్రేష్టంబగునటువంటి యీవ్రత
మును నీకొఱకుఁజెప్పితిని. దీనివిషయమై సంశయముబూనబనిలేదు.

శ్లో॥ యేఽపిశృణ్వంతి సతతం పఠ్యమానంపఠంతి యే। తేఽపి
పాపవినిర్ముక్తాః ప్రాప్స్యంతిచ హరేః పదం॥

తా॥ ఎవరు చదువదగిన యనంతునికథ నెల్లప్పుడు చదువు
చున్నారో వారు పాపములనుండి విడువఁబడినవారై విష్ణునివాసమగు
వైకుంఠమును జేరెదరు.

శ్లో॥ సంసార గహ్వారగుహాసు సుఖం విహర్తుం వాంఛంతి
యేకురుకులోద్భవ శుద్ధసత్వాః।సంపూజ్యచ త్రిభువనేశ మనంతదేవం
బధ్నంతి దక్షిణక రేవరతోరకంతే॥

తా॥ కురువంశంబునబుట్టిన యోధర్మరాజా! పరిశుద్ధమైనమన
స్సుగలవారై యెవరు సంసారసుఖముల ననుభవింపవలయునని కోరెద
రో వారు మూఁడులోకములకు నధిపతియగు ననంతునిబూజించి శ్రేష్ఠం
బగు తోరమును కుడిచేతియందు గట్టుకొనుచున్నారు.

ఇత్యనంత కథాసమాప్తా.

ఉద్యాపనవిధిః

యుధిష్ఠిరః॥ శ్లో॥ తత్ప్రసాదా చ్ఛ్రుతం కృష్ణ మయానంతవ్రతం
శుభం। ఇదానీం బ్రూహి మేఽనంతవ్రతోద్యాపన ముత్తమం॥

తా॥ ఓకృష్ణా! నీయనుగ్రహము శుభములనొసగు ననంతవ్రత
మును వింటిని- శ్రేష్ఠమైన యీయనంతవ్రతోద్యాపనము నిప్పుడువిన
గోరెదఁగావున నాకొఱకుఁ జెప్పుమని ధర్మరాజు కృష్ణమూర్తి
నడిగెను.

కృష్ణః॥ శ్లో॥ శ్రుణు పాండవవక్ష్యామి వ్రతోద్యాపన ముత్తమం
కృతేన సఫలం పార్థ వ్రతం భవతి నిశ్చితం॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాడు. పాండుతనయుండవగు
నోధర్మరాజా! ఏయుద్యాపనమునుజేసిన వ్రతము నిశ్చయముగా సఫల
మగునో యట్టి శ్రేష్ఠంబగు నుద్యాపనమును జెప్పెద వినుము.

శ్లో॥ ఆదౌ మధ్యే తథాచాంతే వ్రత స్యోద్యాపనంభవేత్।యది

విత్తస్యచిత్తస్యసంపత్తిశ్శుభకాలతా ॥ తదాచోద్యాపనంకుర్యాచ్ఛుభలగ్నే శుభేదినే ॥

తా॥ మొదటగాని మధ్యయందుగాని యంతమందు గాని యుద్యాపనమును జేయవలయును. ఎప్పుడు ద్రవ్యముండునో యెప్పుడు నిర్మలచిత్తము గలవాఁడై యుండునో యెప్పుడు శుభకాలము సంభవించునో యప్పుడు తిథివార నక్షత్రములను విచారించి శుభలగ్నమందు వుద్యాపనమును జేయవలయును.

శ్లో॥ చతుర్దశ సువర్షేసు ముఖ్య ముద్యాపనవ్రతం। కాయశుద్ధస్త్రయోదశ్యాం బ్రహ్మచారీ వ్రతీ తతః ॥ భుఏకక్తేన నియమంకృత్వాభక్తిసమన్వితః। తతఃప్రాతశ్చతుర్దశ్యాం స్నాత్వాతీర్థేశుభేశుచిః॥ సంకల్పయే ద్రమాకాంతం దేశకాలా వనుస్మరన్॥

తా॥ పదునాలుగు సంవత్సరము లుద్యాపనమును జేయుట ముఖ్యము. ఉద్యాపనము జేయఁదలఁచి త్రయోదశియందు స్నానము చేసి బ్రహ్మచర్యవ్రతముఁబూని యనంతరక మొకపూట భుజించి నియమము భక్తిగలవాఁడై పిమ్మట చదుర్దశిదినంబునఁ ప్రాతఃకాలమందు శుభ్రమైన నుదకములో స్నానముజేసి పరిశుద్ధుఁడై విష్ణుమూర్తిని ధ్యానించుచు దేశకాలములను గీర్తించుచు వ్రతము చేయుటకు సంకల్పింపవలయును.

శ్లో॥ తతోనద్యాం దేవఖాతే తీర్థే ప్రస్రవణే తథా । సర్వౌషధై స్సర్వగంధైస్తిలకల్కై రథామలైః। వేదోక్తవిధినా స్నాయాత్సంతర్ప్య పితృదేవతాః॥

తా॥ అనంతరము నదిలోగాని, దేవతలచేఁద్రవ్వబడిన సరస్సులలోఁగాని, ప్రవాహోదకములోఁగాని, సెలయూటలోగాని సమస్తౌషధరసంబును సమస్తసుగంధద్రవ్యములను తిలామలకపిష్టమును ధరించి వేదోక్తప్రకారంబుగా స్నానముచేసి పితృదేవతలని తర్పణచే దృప్తినొందింపవలయును.

శ్లో॥ తతో గృహం సమాసాద్య వేదీం కృత్వా సుశోభనాం। తన్మధ్యే హ్యుపవేశ్యాఽథ దేశకాలౌస్మరేత్తతః॥

తా॥ అనంతరము గృహంబునకువచ్చి శోభస్కరమైనమంటప మేర్పఱచి యామంటపమధ్యమునఁగూర్చుండి దేశకాలములనే స్మరింపవలయును,

శ్లో॥ గణేశం పూజయిత్వాఽథ పుణ్యాహం వాచయేద్ద్విజః। ఆచార్యంచ సపత్నీకం వరయే ద్వేదపారగం॥

తా॥ అనంతరమాబ్రాహ్మణుఁడు విఘ్నేశ్వరునిబూజించి పుణ్యాహవాచనము చేసి భార్యకలవాఁడును వేదముచదివినవాఁడునగు నొక బ్రాహ్మణు నాచార్యునిగా వరింప వలయును.

శ్లో॥ బ్రాహ్మణంచ సదస్యంచ ఋత్విజశ్చ చతుర్దశ। సర్వాన్ వస్త్రైరలంకారై ర్జలపాత్రాది నార్చయేత్॥

తా॥ సభాపతియగు నొక బ్రాహ్మణుని బదునలుగురు ఋత్విక్కులను వస్త్రాలంకారములచేతబూజించి జలసహితమైన పాత్రలనియ్య వలయును.

శ్లో॥ తైర్లేఖయేన్మండలకం పంచవర్ణైస్సుశోభనైః। విరచ్యసర్వతోభద్రం మంటపాంతస్తు మధ్యగం॥

తా॥ పైనిఁజెప్పబడిన ఋత్విక్కులు పూజింపఁబడిన యనంతరము శోభస్కరమైన యైదువర్ణములు గల ముగ్గులచే మంటపమధ్యమందు సర్వతోభద్ర మనుమండలమును రచింపవలయును.

శ్లో॥ బ్రహ్మాదిదేవతా స్తస్మిన్నావాహ్యాపిచ పూజయేత్। తన్మధ్యేపంకజే ధాన్యం యథాశక్తిక్షిపే త్తతః॥

తా॥ మంటపమధ్యమున వేయఁబడిన పద్మమందుఁ దనశక్తి కొలఁది ధాన్యమునుంచి దానియందు బ్రహ్మాదిదేవతల నావాహనము చేసి పూజింపవలయును.

శ్లో॥ సౌవర్ణం రాజతంవాపి తామ్రజంవాపి మృణ్మయం। తస్యోపరిన్యసే త్కుంభ మవ్రణం వర్తులం దృఢం॥

తా॥ బంగారుతోఁగాని రాగితోఁగాని మట్టితోఁగాని వెండితోఁ

గాని చేయఁబడినదియు రంధ్రములులేనిదియు గుండ్రనిదియు దృఢమై నదియు నగు కలశమును ఆధాన్యమందుంచవలయును.

శ్లో॥ తస్మిన్ జలం గంధపుష్పఫలపల్లవమృత్తికాః। క్షిప్త్వా రత్నం హిరణ్యంచ వస్త్రయుగ్మేన వేష్టయేత్॥

తా॥ ఆ కలశమునందు నుదకమును గంధమును బుష్పములను ఫలములను చిగురుటాకులను తులసి మృత్తికను రత్నములను బంగారు నుంచి నూతన వస్త్రములరెంటిని జుట్టవలయును.

శ్లో॥ సౌవర్ణం రాజతం తామ్రం మృణ్మయం వంశజంతథా। పాత్రం తదుపరి న్యస్య వసనం పట్టతూలజం॥ లిఖేద్దష్టదళం తత్ర చందనేన సుగంధినా। పద్మం విరచ్య తన్మధ్యేఽనంతమూర్తింనిధాయచ॥ పలేననా తదర్థేన మాషకేణాపివా కృతాం। సౌవర్ణీం రమయాయుక్తాం శంఖచక్రగదాబ్జకాం॥ ఆవాహనాదిశాస్త్రోక్తం బూజయే త్సుసమాహితః॥

తా॥ బంగారుచేఁగాని రాగిచేఁగాని వెండిచేఁగాని మంటిచేఁగాని వెదురుచేగాని చేయబడిన పాత్రమును ఆకలశమునందుంచి దానియందు పట్టువస్త్రమునుగాని నూలువస్త్రమునుగానియుంచి దానియందు బరిమళించుచున్న మంచిగంధముచే నెనిమిదిరేకులుగల పద్మమును లిఖించి పలము బంగారుతోఁగాని దానిలోసగము బంగారుతోఁగాని అయిదు గురువింద గింజలయెత్తు బంగారుతోఁగాని చేయఁబడినదియు శంఖము చక్రము గద పద్మము మొదలగు చిన్నెలుగలిగి లక్ష్మీసహితమైన యనంత ప్రతిమను జేయించి యాప్రతిమను బూర్వమందుఁ జెప్పినట్లు గంధముచే లిఖింపఁబడిన పద్మమందుంచి స్థిరచిత్తుఁడై శాస్త్రమందుఁ జెప్పబడిన రీతి నావాహనాది పూజలను జేయవలయును.

శ్లో॥ పంచామృతేన స్నపయేత్తతశ్చ వసనద్వయం పట్టతూలాదికం పీత మర్పయి త్వార్చయే ద్వ్రతీ॥

తా॥ వ్రతమునుజేయు పురుషుండు పంచామృతములచే

స్నానముచేయించి యనంతరము పచ్చని పట్టువస్త్రములుగాని నూలు వస్త్రములు సమర్పించి పూజింపవలయును.

శ్లో॥ పుష్పైర్ధూపై స్తదీపై ర్నైవేద్యైశ్చ ప్రపూజయేత్ । పునః పుష్పాణి సంగృహ్య పూజయేన్నామభిః క్రమాత్ ॥

తా॥ పుష్పములచేతను, ధూపములచేతను, దీపములచేతను, నైవేద్యములచేతను బూజించి తిరిగి పుష్పములను గ్రహించి ముందు చెప్పబోవు నామములచే నవయవపూజను జేయవలయును.

శ్లో॥ అనంతాయనమః పాదౌ గుల్ఫౌ సంకర్షణాయచ। కాలాత్మనేజానునీచ జఘనే విశ్వరూపిణే ॥ కటిం వై విశ్వరూపాయ మేఢ్రిం వై విశ్వసాక్షిణే । నాభింతు పద్మనాభాయ హృదయం పరమాత్మనే ॥ కంఠం శ్రీకంఠనాథాయ బాహూ సర్వాస్త్రధారిణే । ముఖంతు వాచస్పతయే చక్షుషీ కపిలాయచ॥ లలాటం కేశవాయేతి శిర స్సర్వాత్మనే తథా । నమః పాదౌ పూజయామీ త్యేవ మాది ప్రపూజయేత్ ॥

తా॥ అనంతాయనమః - పాదౌపూజయామి, సంకర్షణాయ నమః - గుల్ఫౌపూజయామి, కాలాత్మనేనమః - జానునీపూజయామి, విశ్వరూపిణేనమః- జఘనేపూజయామి, విశ్వరూపాయనమః-కటింపూజయామి, విశ్వసాక్షిణేనమః-మేఢ్రింపూజయామి, పద్మనాభాయనమః-నాభిం పూజయామి, పరమాత్మనేనమః - హృదయం పూజయామి, శ్రీకంఠనాథాయనమః -కఠంపూజయామి,సర్వాస్త్రధారిణేనమః -బాహూన్ పూజయామి, వాచస్పతయేనమః- ముఖంపూజయామి, కపిలాయనమః చక్షుషీపూజయామి, కేశవాయనమః- లలాటంపూజయామి, సర్వాత్మనేనమః- శిరఃపూజయామి ॥ ఈ ప్రకారంబుగా ప్రతిపదంబుతో నమః అను శబ్దము ప్రయోగించి సర్వావయవపూజను జేయవలయును.

శ్లో॥ ఏవం సంపూజ్య విధినా రాత్రౌ జాగరణం చరేత్ । గీతవాది త్రనృత్తాది పురాణశ్రవణాన్వితం ॥

తా॥ ఈ ప్రకారంబుగ శాస్త్రానుసారముగాబూజచేసి గానము నాట్యము మృదంగాది వాద్యములు పురాణము వినుట మొదలగు వానిచే నా రాత్రియంతయు జాగరణము చేయవలయును.

శ్లో॥ ప్రతియామంప్రకుర్వీత పూజాంగంధాదినాహరేః। నానాఫలాని భక్ష్యాణి స్వాదూనిచ నివేదయేత్ ॥

తా॥ ప్రతియామమును గంధము మొదలగువానిచే ననంతుని బూజించుచు రుచిగల యనేకవిధములగు ఫలములను భక్ష్యములను నివేదన చేయవలయును.

శ్లో॥ తతః ప్రభాతసమయే స్నాత్వాచార్యాదిభి స్సహ। అనంతం పూజయేత్పూర్వత్ జుహుయాచ్చ యథావిధి ॥

తా॥ అనంతరముదయంబున లేచి ఋత్విక్కులతోగూడ స్నానముచేసి పూర్వమువలెనే అనంతునిబూజించి యథావిధిగా హోమము జేయవలయును.

శ్లో॥ కుండేవా స్థండిలే కుర్యా దగ్నిస్థాపనపూర్వకం। ఆజ్యభాగాంత మాచార్య స్స్వగృహ్యోక్తవిధానతః॥

తా॥ కుండమందైనను స్థండిలమందైనను ముందుగ నగ్నిప్రతిష్ఠాపనముజేసి యనంతరము ఆచార్యుడు తన శాఖానుసారముగా ఆజ్యాహుతుల నుంచవలయును.

శ్లో॥తతోఽశ్వత్థసమిద్భి స్తదభావేఽన్యాభి రేవవా।దుగ్ధమధ్వాజ్యదధిభి స్తిలై ర్వాపాయసేనచ॥ ఆజ్యేనచ ప్రతిద్రవ్య మష్టోత్తరసహస్రకం అష్టోత్తరశతం వాష్టావింశతిం జుహుయాత్ క్రమాత్॥

తా॥ అనంతరము రావిసమిధలచేతను అవిలేనిపక్షమున నితరమైన సమిత్తులజేతను పాలు, తేనె, నెయ్యి, పెరుగు, నువ్వులు, పరమాన్నము మొదలగువానిచేతను బ్రతిద్రవ్యమును వెయ్యి యెనిమిది పర్యాయములు హోమము చేయవలయును లేక నూటయెనిమిది పర్యాయములు గాని యిరువది యెనిమిదిపర్యాయములుగాని క్రమముగా హోమము చేయవలయును.

శ్లో॥ అతో దేవేతి మంత్రేణ స్త్రీణాంవై నామమంత్రతః।ప్రణవాదిచతుర్థ్యంతం నమోంతానంతనామతః ॥ నామమంత్రైశ్చ జుహుయాచ్చతుర్దశభి రాదరాత్॥

తా॥ 'అతోదేవా' అను మంత్రముచేతను స్త్రీదేవతల నామమంత్రముచేతను హోమంచేయవలయును. ప్రతినామమునకును మొ

దట ఓంకారమును అంతమందు నమః పదమును జేర్చి చతుర్థీ విభక్తిని జెప్పవలయును, పదునాలుగునామ మంత్రములచేత శ్రీద్ధలో హోమ మును చేయవలయును.

శ్లో॥ పురుషసూక్తేన జుహుయా దతో దేవేతి వాపునః । శత మష్టోత్తరం యావత్ప్రత్యేకం జుహుయాద్గురుః॥

తా॥ పురుషసూక్తము చేతను గాని తిరిగి 'అతో దేవేతి' మంత్ర ముచేతను గాని ప్రత్యేకముగా నూటయెనిమిదిపర్యాయములు గురువు నకుహోమము జేయవలయును.

శ్లో॥ చరుహోమ స్తథా కార్యోమంత్రైరేతైర్విచక్షణైః॥ వ్యాఖ్యా॥ ఏతైరిత్యనేనఋత్విగ్భిర్వక్ష్యమాణమంత్రైః జుహుయాచ్చరుణాతథా॥

తా॥ సమర్థులగు ఋత్విక్కులచే జెప్పఁబడిన మంత్రములచే ఆ ప్రకారము చరుహోమము చేయవలయును.

ఓం అనంతాయ స్వాహా। ఓం కాలాయ స్వాహా। ఓం అహోరా త్రాయ స్వాహా। ఓం అర్ధమాసాయ స్వాహా। ఓం అయనాయ స్వాహా ఓం ఋతుభ్యః స్వాహా। ఓం పరివత్సరాయ స్వాహా। ఓం కపిలాయ స్వాహా। ఓం శేషాయస్వాహా ఓం కాలాత్మనే స్వాహా। ఓం ఉషసే స్వాహా।ఓం కాష్టాయైస్వాహా।ఓం ముహూర్తాయస్వాహా।ఓం శేషాయ స్వాహా। ఓం భూరగ్నయేపృథివ్యైచ। మహాతేచ స్వాహా। ఓం భువో వాయవేచాంత రిక్షాయచమహాతేచ స్వాహా। ఓంసువరాది త్యాయచ దివేచ మహాతేచ స్వాహా।ఓం భూర్భువస్సువశ్చంద్రమసేచ నక్షత్రే భ్యశ్చ దిగ్భ్యశ్చ మహాతేచ స్వాహా ॥ ఆజ్యతిలైస్స్విష్టకృతం ప్రజా పతిభ్యో జుహుయాత్ ॥

తా॥ పైని జెప్పిన నామములతో హోమముచేసి నువ్వులను గలిపి ప్రజాపతులకొఱకు హోమము చేయవలయును.

శ్లో॥ సమిదాదిభి రేవంచ ప్రత్యేకం జుహుయా త్క్రమాత్ ॥ ఏవం స్విష్టకృదాదీని పూర్ణపాత్రాంత మాచరేత్ ॥

తా॥ యీ ప్రకారము సమిధలు మొదలగువానిచేఁ గ్రమం బుగా హోమముచేసి యీ ప్రకారంబుగానే స్విష్టకృత్తు మొదలగునవి చేసి పూర్ణపాత్రోదకముచే మార్జనాంతమువరకు చేయవలయును.

శ్లో॥ జపే త్పురుషసూక్తంతు స్మృత్వానంతం సూరోత్తమం పూర్ణాహుతించ జుహుయాత్॥ హోమంతే విశ్వమిత్ర్యుచా॥

తా॥ పురుషసూక్తమును బఠనజేసి వేదోత్తముఁడగు ననంతుని ధ్యానించి హోమములన్నియుఁ జేసిన పిమ్మట 'విశ్వం' అనుమంత్రముచేఁ బూర్ణాహుతిని జేయవలయును.

శ్లో॥ హోమశేషం సమాప్యాథ కృత్వా త్ర్యాయుష మేవచ। తతోవై లోకపాలాంశ్చ గ్రహాన్పూజ్యయథాక్రమం॥ గీతవాదిత్రనినదైర్దత్వా పూర్ణాహుతిం వ్రతీ॥

తా॥ మిగిలిన హోమము నంతయుఁ జేసి త్ర్యాయుషమను మంత్రపఠనము జేసి యనంతరము అష్ట దిక్పాలకులను గ్రమంబుగాఁ బూజించి గానములు వాద్య విశేషములు ధ్వనులను జేయుచుండగా వ్రతమును జేయు పురుషుఁడు పూర్ణాహుతిని అగ్నియందుంచవలయును.

వాక్యం॥ కేషాంచి న్మతే రాత్రౌ హోమః॥

తా॥ రాత్రియందు హోమమును జేయవలయునని కొందఱ మతమైయున్నది.

శ్లో॥ పూజాయిత్వా హరిందేవ మాచార్యం పూజయేత్తతః। పరిపూజ్యసపత్నీకం వస్త్రాలంకారభూషణైః॥

తా॥ దేవుండగు ననంతుని నిట్లుపూజించి యనంతరము భార్యతోఁగూడ నాచార్యుని వస్త్రములు భూషణములు మొదలగు నలంకారములచేఁ బూజింపవలయును.

శ్లో॥ వస్త్రాలంకారభూషాద్యైస్తతో ధేనుంసమర్చయేత్॥

తా॥ అనంతరము వస్త్రములు అలంకారములు భూషణములు మొదలగు వానిచే గోవును బూజింపవలయును.

శ్లో॥ పయస్వినీం సుశీలాంచ వస్త్రాలంకారభూషణాం। స్వర్ణశృంగీం రౌప్యఖురాం తామ్రపృష్ఠీం సుశోభనాం॥ కాంస్యదోహాం రక్తపుచ్ఛాం నిష్కకంఠీం సవత్సకాం॥ సురభి ర్వైష్ణవీమాతా నిత్యం విష్ణుపదేస్థితా॥ గ్రాసం గృహాణ మద్దత్తం గౌర్మాత స్త్రాతుమర్హసి॥

తా॥ పాలు నిచ్చునదియు మంచి స్వభావముకలదియు వస్త్రములు, అలంకారములు భూషణములు మొదలగువానిచే నలంకరింపఁబడినదియు బంగారు కొమ్ములు గలదియు వెండి డెక్కలు గలదియు రాగి పృష్ఠము గలదియు మంచిదియు కంచు పొదుగుగలదియు నెఱ్ఱని దోక గలదియు నిష్కమెత్తు బంగారు కంఠమందుఁగలదియు దూడగలదియు నగుగోవును విష్ణుసంబంధమైనసురభియను కామధేనువు తల్లిగాఁ గలదానవును ఎల్లప్పుడును విష్ణుపాదములయందు నివసించు దానవును దల్లివియు నగు నోధేనువా! నేనిచ్చు నటువంటి గడ్డిని భక్షించి నన్ను రక్షింపుమా యని గోదానము చేయవలయును. ఆ దానము నిచ్చునప్పుడు ముందు చెప్పఁబోవు మంత్రములను పల్కవలయును.

శ్లో॥ గవా మంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ।యస్మాత్తస్మాచ్ఛుభం మే స్యా దిహలోకే పరత్రచ॥

తా॥ ఏ హేతువువలన ఆవుయొక్క అవయవములయందు పదునాలుగు లోకములున్నవో యా హేతువువలన ఈలోకంబునను బరలోకంబునను నాకు శుభము గలుగుగాక.

శ్లో॥ గావో మే పురతస్సంతు గావో మే సంతు పృష్ఠతః । గావో మే హృదయే సంతు గవాంమధ్యే వసా మహ్యం ॥ మంత్రేణానేన సంపూజ్యస్వాచార్యాయ నివేదయేత్॥

తా॥ ఆవులు నాముందు నెప్పుడు నివసించుఁగాక, ఆవులు నావెనుక నివసించుఁగాక, ఆవులు నాహృదయమందు నివసించుఁగాక; నేను ఆవులమధ్యమున నెప్పుడును నివసింతును. అనునర్థములనిచ్చు పైని రెండుమంత్రంబులం బఠియించి తనయాచార్యునకు గోదానమియ్యవలయును.

శ్లో॥ గోదానస్యవిధానార్థం దద్యాత్స్వర్ణం యథావిధి అనంతం పరివారంచ బ్రాహ్మణాయ నివేదయేత్॥

తా॥ గోదాన సంపూర్తికొఱకు యథావిధిగా సువర్ణదానము చేయవలయును. పరివారముతోఁగూడిన యనంతుని ప్రతిమను బ్రాహ్మణునికొరకు దానమియ్యవలయును.

శ్లో॥ ఋత్విజః పూజయిత్వాథ తేభ్యో దద్యాచ్చదక్షిణాం।

చతుర్దశైవ కుంభాంశ్చ పక్వాన్నపరిపూరితాన్॥ వస్త్రోపవీతే దద్యా
చ్చ అనంతః ప్రీయతామితి॥

తా॥ ఋత్విక్కులనుబూజించి యనంతరమువారలకు దక్షిణల
నియ్యవలయును. భక్ష్యాదులచే నింపఁబడిన పదునాలుగు కలశములను
వస్త్రములను యజ్ఞోపవీతములను అనంతుని ప్రీతికొరకు నియ్యవలెను.

శ్లో॥ ఆచార్యాదీన్ భోజయిత్వా పూర్ణతాం వాచయేత్తతః
అథానంతం విసృజ్యాపి గృహ్ణీయా దాశిషస్తథా॥

తా॥ ఆచార్యుఁడు మొదలగువారిని భుజింపఁజేసివ్రతసంపూర్ణ
వచనములనుబొంది యనంతరము అనంతునకు నుద్యాపనఁజెప్పి బ్రా
హ్మణులవలన నాశీర్వాదములను బొందవలయును.

శ్లో॥ భక్తియుక్తో నమస్కృత్య బ్రాహ్మణానాం క్షమాపయే
త్తతోహృష్టో బంధుయుతో భుంజీయా త్సుసమాహితః॥

తా॥ భక్తిశ్రద్ధలతోఁగూడి బ్రాహ్మణులకు నమస్కారముఁజేసి
క్షమాపణఁగోరి యనంతరము సంతోషముగలవాఁడై స్వస్థమైన
చిత్తముతో బంధువులతోఁగూడఁ దానుభుజింపవలయును,

శ్లో॥ ఏవనకృతేఽనంతఫల మనంతా ల్లభ్యతే నృణాం॥

తా॥ ఈప్రకార మనంతవ్రత మాచరించినయెడల అనంతుని
యనుగ్రహమువలన ననంతమైన ఫలమును మనుష్యులు పొందుదురు.

ఇతి శ్రీ భవిష్యోత్తర పురాణే అనంత వ్రతోద్యాపనం
సంపూర్ణమ్.

## అథ నష్టదోరకవిధిః

శ్లో॥ అనంతవ్రతమాహాత్మ్యం కృత్స్నం కృష్ణత్వయోదితం।
భగవన్ దోరరూపేణ భాగ్యదోఽసి మహాత్మనాం॥దోరంప్రమాదతో
నష్టం యదిస్యాద్విదితంజనైః। తదాకింకరణీయంస్యా ద్వ్రతం త్రై
లోక్య పావనమ్॥

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగు నోకృష్ణా! అనంతవ్రత
మహాత్మ్య మంతయుజెప్పితివి. నీవు మహానుభావులకుఁ దోరస్వరూపమున
భాగ్యము గలుగఁజేయువాఁడవైతివి. ప్రమాదమువలనఁ దోరము నష్ట
మైనచో అది జనులకందరకుఁ దెలియబడెనేని మూఁడు లోకములను

బవిత్రముచేయు ననంతవ్రతవిషయమై యేమిచేయవలయునని ధర్మ రాజు కృష్ణమూర్తి నడిగెను.

కృష్ణః॥ శ్లో॥ దోరేనష్టేమహాన్ దోషః ప్రభవేత్ర్వతినా మిహ। తస్మాత్తద్దోషనాశార్థం ప్రాయశ్చిత్తం విధీయతే॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు. దోరము నశించెనేని వ్రతముజేయువారికి విశేషమైన దోషము సంభవించును. అందువలన నాదోషనివృత్తికొరకు బ్రాయశ్చిత్తము విధింపబడినది.

శ్లో॥ గురుం ప్రదక్షిణీకృత్య సోపహారస్సమాహితః। విజ్ఞాప్య దోరనాశంచ కృత్వాదోరంవ్రతీతతః॥

తా॥ వ్రతముచేయుపురుషుఁడు గురువునకు నమస్కారముచేసి కానుకలను సమర్పించి నిశ్చలచిత్తముగలవాఁడై దోరము నశించిన విషయముగురువుతోఁజెప్పి నూతనమైనదోరమును గ్రహింపవలయును.

శ్లో॥ హవ్యవాహం ప్రతిష్ఠాప్య తస్మిన్ ధ్యాత్వాహరిం పరం। ఆజ్యమగ్నా వధిశ్రిత్య దద్యాద్విప్రాయ చాసనమ్॥

తా॥ అగ్నిహోత్రుని బ్రతిష్ఠచేసి ఆ యగ్నియందుఁ బరమ పురుషుండైన విష్ణుమూర్తిని ధ్యానముచేసి యాజ్యమును అగ్నియం దుంచి యనంతరము బ్రాహ్మణునకు నాసనమిచ్చి కూర్చుండఁబెట్టి ముందు చెప్పఁబోవు ప్రకారంబున హోమము చేయవలయును.

శ్లో॥ అష్టోత్తరశతం హుత్వా మూలమంత్రేణ వైష్ణవం। నామ మంత్రేణ తత్కృత్వా ద్వాదశాక్షరసంయుతమ్॥

తా॥ మూలమంత్రముచే విష్ణుసంబంధమైన హోమమున న్నూట యెనిమిది పర్యాయములు చేసి యనంతరము ద్వాదశాక్షరములతోఁ గూడిన మంత్రముచే ఆహోమమును చేయవలయును.

శ్లో॥ కేశవాది సకృత్తౌ హుత్వాప్రాయశ్చిత్తంతు శక్తితః। పూర్ణాహుంతి తతోహుత్వా హోమశేషం సమాపయేత్॥

తా॥ కేశవాదినామములచే నొక్కొక్కపర్యాయము హోమ ముచేసి ప్రాయశ్చిత్తహోమములను జేసియనంతరము పూర్ణాహుతినిగా వించి మిగిలిన హోమములను సంపూర్తిగాఁ జేయవలయును.

శ్లో॥ వ్రతచ్ఛిద్రం క్రియాచ్ఛిద్రం యచ్ఛిద్రం వ్రతకర్మణి ।
వచనాద్బ్రాహ్మణదేవానాం సర్వంసంపూర్ణతాంవ్రజేత్ ॥

తా॥ వ్రతకర్మమునందలి వ్రతలోపముగాని క్రియాలోపము గాని మంత్రము మొదలైన యేలోపములు సంభవించినను బ్రాహ్మణుడు వాక్యములవలన నన్నిదోషములును బరిహారమై వ్రతమంతయు సంపూర్తినొందును.

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

తా॥ ఓజనార్దనుఁడా! మంత్రలోపముగాని క్రియాలోపము గాని భక్తిలోపముగాని యేదికలదో ఓదేవా! ఆలోపమంతయు నీసంబంధమైన పూజవలనఁ దొలఁగి యీవ్రతము సంపూర్తినొందునుగాక.

శ్లో॥ ఆచార్యపూజనంకార్యం దక్షిణాద్యైర్నృపోత్తమ । ఏవం శాంతివిధిం కృత్వా పూర్వవద్వ్రత మాచరేత్ ॥ తస్మాత్సర్వప్రయత్నేన ప్రాయశ్చిత్తంచరేత్సుధీః ॥

తా॥ ఓరాజోత్తమా! దక్షిణమొదలగువానిచే నాచార్యునకుఁ బూజఁగావింపవలయును ఈప్రకారము శాంతివిధిని జేసిపూర్వమువలెనే యనంతవ్రతము చేయవలయును విద్వాంసుఁడు సమస్తప్రయత్నముల చేతను ప్రాయశ్చిత్తమును జేయింపవలయును.

ఇతి భవిష్యోత్తరే నష్టదోరకరవిధి స్సమాప్తః ॥

తా॥ ఈ ప్రకారము భవిష్యోత్తరపురాణంబున అనంతవ్రతమునందు దోరకమునశించినందుకుఁ జెప్పఁబడినప్రాయశ్చిత్తము సంపూర్ణమయ్యెను. ఈ గ్రంథంబున ననంతవ్రతపూజయును కథయును ఉద్యాపనమును దోరమునశించినందుకుఁ బ్రాయశ్చిత్తమును జెప్పఁబడియెను.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్ । తత్సర్వం క్షమ్యతాం దేవోఽనంతోఽ స్సంతకృపాంబుధిః ॥

తా॥ ఈ గ్రంథంబునఁ బదలోపముగాని యక్షరలోపముగాని మరియేయితరలోపముగాని సంభవించినయెడల వానినన్నిటిని అపారదయాసముద్రుండగు ననంతదేవుఁడు క్షమించిరక్షించుఁగాక.

అనంత వ్రతోద్యాపనం స్సమాప్తః.